# తెలుగు సీమలో

# సాంస్కృతిక పునరుజ్జీవనము

# ముందుమాట

భారతీయ సంస్కృతి సాగరములో ప్రాంతీయ సంస్కృతు లన్నియును మహానదుల వలె సంగమించినవి. కాని ఒక్కొక్క మహానది ఒక్కొక్క విశిష్టతను కలిగి యున్నట్లే ఆంధ్రాది సంస్కృతులు కూడ తమ ప్రత్యేకతలను నిలుపుకొన్నవి.

ఆంధ్రజాతి, వారి సంస్కృతి చాల ప్రాచీనమైనవి. చరిత్రకందని అజ్ఞాత కాలము నాటికే వీరు బౌద్ధిక వికాసము చెంది యుండిన వారని దక్కన్‌లో విరివిగా బయలు పడుచున్న ప్రాచీన సమాధులలోని సుందర వస్తు సముదాయము చాటి చెప్పుచున్నది. వైదిక మంత్రద్రష్టలగు మహర్షులలో మధుచ్ఛందు డాంధ్రుడని పరిశోధకులన్నారు. బుల్హర్ హుల్ట్జు పండితులు ఆపస్తంభ బోధాయనులు ఆంధ్రులని నిరూపించినారు. అయినచో సూత్రకాలము నాటికే ఆంధ్రుల ధీవైభవము మిన్నుముట్టినదన వలెను. పురాణ కాలమునను వీరికి తగిన స్థానము కలదు. చారిత్రక యుగారంభమగు మౌర్య సామ్రాజ్య కాలము నాటి ఆంధ్రుల ఉచ్చస్థితి గ్రీకు రాయబారి మెగస్తనీసును వెరగు పరచినది. పాటలీపుత్రము నాక్రమించి గంగా పినాకినీ పర్యంత భూమినేలిన శకపురుషులైన ఆంధ్ర సాతవాహనుల మహోన్నత దశ మరువరానిది. బౌద్ధమున మహాయాన పంథను స్థాపించి అంధక సంప్రదాయమును టిబెట్, చీనా, సింహళ ములకు ప్రాకించిన నాగార్జునాచార్యుడు తెలుగుసీమలో వెలసినవాడు. పూర్వ మీమాంసా దర్శనమునకు భాష్యకారుడై జైన బౌద్ధ మత ఝంఝా మారుతముల నుండి వైదిక ధర్మము నుద్ధరించిన కుమారిల భట్టపాదుడు తెలుగువాడు. ఇటీవలి వెయ్యేండ్ల సంగతి సుప్రసిద్ధమే. పరిపూర్ణ మానసిక వికాసము చెందిన ఆంధ్రుల సంస్కృతి దేశ విదేశాలలో వేళ్ళు పాతుకొన్నది.

అమరావతి నాగార్జునకొండ వాస్తు శిల్ప పద్ధతులు టిబెట్టునకు జావా బలి ద్వీపములకు వలస పోయినవి. ఆంధ్ర నృత్త కళాలక్ష్మి రామప్ప

గుళ్ళలో లాస్యము చేయుచున్నది. భరత నాట్యమునకు తెలుగువాని మేలికానుక కూచిపూడి భాగవతము. వీనికి మెట్లు కల్పించి, డెబ్బది మూడవ మేళకర్తను సృష్టించి విశ్వమును చకిత మొనర్చు జాలిన గాన కళా కౌశల్యము తెలుగువానిది. లేపాక్షి, అనెగొంది, అజంతా విహార ములలోని తెలుగు చిత్రలేఖనము ప్రపంచమున కొజ్జబంతి కాగలిగినది. కవితా కన్యను గజాందోళికములపై నెక్కించి శారదా విజయధ్వజముతో గౌరవించిన రసిక జాతి మనది. ఇట్లే తలచుకొన్నచో ఒడలు పులక రించును. తరువాతి పరిస్థితికి గుండె చెరువగును. విధి అవిలంఘ్య మైనది.

విజయనగర సామ్రాజ్య పతనముతో దక్షిణాపథమున గూఢ విజ్ఞాన భాను డస్తమించినాడు. భరతఖండమే గాఢనిద్ర పోయినది. కాలవిపాక మున విదేశ వర్తకులు విజేతలైనారు. నడుమంత్రపు సిరితో తబ్బిబ్బులైన పాశ్చాత్యులు నిద్రాముద్రితమైన భారత జాతిని తట్టి లేపినారు. 19వ శతాబ్దారంభమున తొలికోడి కూసినది. ఒక్కొక్కరే నిద్రమత్తును వది లించు కొన్నారు. ఆంధ్రుడాలస్యముగ లేచినాడు. పొరుగువారి నందు కొనవలెనను పూనికతో పరువెత్తుచున్నాడు. తొందరతో తొట్రుపాటు పడు చున్నాడు. వెనుక ముందులు చూడక పురోగమించు చున్నాడు. అదే తెలుగుసీమలో జరుగుచున్న పునరుజ్జీవనము

ఒక శతాబ్ది కాలములో తెలుగుసీమ యందన్ని రంగాలలో కలిగిన ఆ సాంస్కృతిక పునరుజ్జీవనమే ఈ చిన్ని పొత్తమున హృదయంగమ ముగ, సంగ్రహముగ, సమగ్రముగ వర్ణింపబడినది. తెలుగువారి సర్వతో ముఖ వికాసమును కీర్తించు వైతాళికులైన శ్రీ వేపులపల్లి రామానుజరావు గారు ప్రాభాతిక మంగళ గీతములతో ప్రబోధించుచున్నారు. ఈ పుస్తకము ఆంధ్రావళి మోదమును బడయుగలదని ఆశించుచున్నాను.

పాలవెల్లి.
మన్మథ, మార్గశిరము.

పులిజాల హనుమంతరావు

కాల గర్భమున ఒక శతాబ్దము ఏమంత దీర్ఘమైనది కాదు. కాని భారత దేశ చరిత్రలో గడచిన శతాబ్దము మిక్కిలి ప్రధానమైనదని చెప్ప వలెను. 1855 నుండి 1955 వరకు అనగా ఒక నూరు సంవత్స రాల కాలమున మన దేశములో మహోజ్జ్వలమైన చరిత్ర నిర్మాణము జరిగి నది. నూటయేబది సంవత్సరాలు పరదేశ పరిపాలన క్రింద చితికిపోయిన దేశము స్వాతంత్ర్యము సంపాదించుకొన్నది. ప్రపంచ చరిత్రలో భారతదేశ స్వాతంత్ర్యోద్యమ కథ అద్వితీయమైన ఘట్టము ఈచరిత్రను సింహావలోక నము గావించునపుడు జాతీయ చైతన్యముతోపాటు భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనము సర్వతోముఖముగా అభివృద్ధియైనట్లు వెల్లడియగుచున్నది.

తెలుగు దేశమున ఈ కాలమునందు జరిగిన సాంస్కృతిక పునరు జ్జీవనము సమీక్షించుటకు ముందు సాంస్కృతిక పునరుజ్జీవనమనగా నేమి? అను ప్రశ్నకు విపులముగా సమాధానమిచ్చుట అవసరము. ఐరోపా ఖండ మున స్పష్టమైన ఒకానొక ప్రత్యేక కాలమున కలిగిన భావపరిణామమును సూచించు శబ్దము ఈ పునరుజ్జీవనము. అది ఆ కాలమున ఐరోపా ఖండ మున జరిగిన అభివృద్ధిని సూచించుచున్నది. మధ్యయుగమని చెప్పబడు కాలమునుండి ఆధునిక యుగమని చెప్పు కాలములోనికి అడుగు బెట్టు టకు మార్గదర్శకమైన పరిణామాల కాలమును ఈ పునరుజ్జీవనము సూచించుచున్నది. పునరుజ్జీవనమనగా పునర్జన్మ లేక కొత్త జన్మ. యుగ పరిణామమునకు కారణభూతమైన పాశ్చాత్యరాజ్యాలయొక్క నైతిక వైజ్ఞా నిక దృక్పథాలయందలి మార్పులను ఈ పునరుజ్జీవనము సూచించు చున్నది.

భారతదేశము యొక్క ఇటీవలి చరిత్రకు ఐరోపా ఖండములోని (Renaissance) పునరుజ్జీవనము, కాలమునకు దగ్గరిపోలికలు కన్పించుచున్నవి. భారత దేశమందలి అన్ని రాష్ట్రాలలో, అన్ని రంగాలయందు కొంత తరతమ భేదాలతో కొన్ని స్థానిక ప్రత్యేకతలతో, కొన్ని విశిష్టతలతో ఈ మార్పు అనగా మధ్య కాలమునుండి అధునిక కాలములో అడుగు బెట్టుట స్పష్టముగా కనపడుచున్నది.

నవీనమైన ఇట్టి మార్పునకు ముఖ్యకారణము విదేశ పరిపాలన. మొగలుల యొక్కయు, పాశ్చాత్యుల యొక్కయు పరిపాలనలో కొంత ఉద్రేకపూర్వకముగ, మరి కొంత అనివార్యముగ భారత దేశము జాతీయమైన తన సంస్కృతియందు ఆయా పాలకుల జాతి సిద్ధమగు నాచరణలను, సాంప్రదాయములను లీనము చేసికొన్నది తన్మూలముగ భారతీయ సంస్కృతి పురాతనమైనదానికన్న విశిష్టముగా భాసించుట జరిగినది. ఇట్టి వైశిష్ట్యము నంగీకరించు ప్రజలందరు అధునిక యుగములోని వారే.

నూతన చైతన్యము భావ సంఘర్షణ, నవజీవనము మానసిక పరివర్తన మన దేశమున రాజకీయ సాంస్కృతిక రంగాలలో స్పష్టమగుచున్నవి. మత, వేదాంత అభిప్రాయాలలో నూతన వ్యాఖ్యలు ప్రపంచ పరిస్థితుల ప్రభావము, వైజ్ఞానిక రంగములోని పరిశోధనలు, కళారంగములోని నూతన మార్గాలు, భారతదేశ సాంస్కృతిక పునరుజ్జీవనమునకు దోహదము గావించినవి. పూర్వపు వ్యవస్థలు, అభిప్రాయాలు మారినవి. సర్వతోముఖ భావ పరివర్తన స్పష్టముగా కనపడుచున్నది. మొదట మొగలాయి పరిపాలన ప్రభావము; తరువాత రవి అస్తమించని ఇంగ్లీషు సామ్రాజ్యము మన దేశమున వ్యాపించి అస్తమించినవి. నా జాతి నా దేశము, నా భాష అను భావాలతోబాటు సమాజములో వ్యక్తి స్వాతంత్ర్యము, రాజకీయ రంగమందలి వయోజన ఓటింగుద్వారా ప్రాబల్యము వహించు చున్నవి. ఈ ప్రభావము పల్లె పల్లెల యందును, ప్రతి పట్టణ

మందును స్పష్టముగా కనపడుచున్నది. స్వదేశ సంస్థానాలు పోయినవి. జాగిరుదారీలు అంతరించినవి. భూస్వామ్య విధానము చరమదశలో మున్నది. అచ్చుయంత్రాలు ప్రతి పట్టణము నందవతరించినవి. "జొన్నన్నము జొన్నకలి, పోయి వరి అన్నము సన్నన్నము ఊరూర, ఇంటింట వ్యాపించినవి. యంత్రాలద్వారా వ్యవసాయము చేసికొనుట పల్లె పల్లెకు పరిచయమగుచున్నది. విద్యుచ్ఛక్తి మన దైనందిన వ్యవహారములకు వినియోగపడుచున్నది. ఆధునిక విజ్ఞాన ప్రభావము మన జీవిత మందు అడుగడుగునా ప్రత్యక్షమగు చున్నది. అణచివేయబడిన శక్తులు, దాగుకొనియున్న ప్రతిభ, స్వాతంత్ర్యముపొంది ప్రకాశించు చున్నవి దేశములో ఒక విధమగు క్రొత్త జీవనము కనపడుచున్నది. ఈ నవజీవనము పునరుజ్జీవన ప్రతిబింబము. ఇందుకు తోడు ప్రాచీన విజ్ఞానము, ప్రాంతీయ భాషలలోని పూర్వ సాహిత్యము, ప్రాంతీయ సంస్కృతులు, కళలయొక్క పునరుద్ధరణకు కృషి జాతీయ వికాసమునకు దోహదము చేయుచున్నవి. ఈ దోహద ఫలితమైన శోభనమే, ఈ మంగళమే ఈ నాటి మన దేశమందలి సాంస్కృతిక పునరుజ్జీవనమునకు ముఖ్య ప్రాతిపదిక.

ప్రతి జాతికి, దేశమునకును, అవ్యయమై అవ్యాహతముగ సాగివచ్చు నాచారములు, సాంప్రదాయములు కొన్ని యుండును. ఆయా ప్రజల మానసికదృక్పథము, వారి వారి జీవిత పరిధులననుసరించి. వారు ఇతర మానవాళి యెడచూపగలుగు విశాలతరదృష్టి, సాంఘిక, రాజకీయ, వైజ్ఞానిక మత విషయములలో వారి మేధలు చొచ్చుకొని పోగలుగు లోతులు ఇవన్నియు ఒక్కొక దేశమునకు, జాతికి, విభిన్నములై, విలక్షణములై ఆయా దేశాల మరియు జాతుల ప్రత్యేకతలను యెత్తి చూపుచుండును. వీని కూడలినే ఆ జాతి లేదా ఆ దేశముయొక్క సంస్కృతియని చెప్పవచ్చును. ఇట్టి సంస్కృతి కొన్నిసారులు విచ్ఛిన్నమై నామరూప రహితమై అంతరించిపోవచ్చును. ఒక దేశము పరదేశ పరిపాలనానిపీడితమై, దాస్య

భార వినమ్రమై, పేరు ప్రతిష్ఠలు గణించుకొనని యజ్ఞాతవశయందు, వాని సంస్కృతి పాలకుల సంస్కృతిచే అచ్ఛన్నమై కనుమరగిపోవుట తటస్థింప వచ్చును. దాస్య మేఘములు నలు దెసల చెదరిపోయిననాడు, దేశమాత స్వతంత్రతా కిరణదీప్తిచే కళ కళలాడిననాడు ఆ ఉచ్ఛదశ కనుగుణముగా విస్మృతమైనదానిసంస్కృతికూడ పునరుద్ధరింపబడుటజరుగును. అట్లు జరుగు పునరుద్ధరణలో ఇంతకాలము మిళితమై, మనదిగా చెల్లుబడి నందుచున్న వైదేశిక సంస్కృతినిగూడ గ్రహించుటయు, మన్నించుటయు జరుగవచ్చును. ఒక జాతి విస్మృత సంస్కృతిని వెలుగులోనికి తెచ్చుటయేకాక అన్నినాళ్ళుగా ఆమోదించి అభినందించిన వైదేశిక సంస్కృతీమిళనముచే దానిని మరింత పరిపుష్టముగాచేసి సర్వాంగ సుందరముగా జేయుటయే మన దేశపు సాంస్కృతిక పునరుజ్జీవనము.

కొందరు పునరుజ్జీవన మనగా కేవలము ప్రాచీన విజ్ఞానముయొక్క పునరుద్ధరణ అని భావించుట కలదు. ఇతర దేశాలమాట ఎట్లున్నప్పటికిని మన దేశములో పునరుజ్జీవనమనగా ప్రాచీన విజ్ఞాన పునరుద్ధరణమాత్రమే కాదు. ప్రాచీన విజ్ఞాన పునరుద్ధరణ, ప్రాచీన కళల పునరుద్ధరణ, ఈ సాంస్కృతిక పునరుజ్జీవనములోని ఒక భాగము మాత్రమే. ప్రాచీన విజ్ఞానము కళలు మొదలైనవాని పునరుద్ధరణ, నేటి నవ సమాజ సౌధమునకు ఒక గట్టి పునాది మాత్రమే. నవ చైతన్యము, ఆధునిక భావ పరిణామాలు ఈ సౌధ నిర్మాణమునకు ముఖ్యసాధన సామగ్రి. గాంధి, నెహ్రూల రాజకీయ, నైతిక దృక్పథాలు భారతదేశ ఉన్నతిగూర్చి భవిష్యత్తును గూర్చి ఈ నాయకులొసగిన విశిష్ట అభిప్రాయాలు అన్ని రంగాలలో ప్రాతక్రొత్తల మేలి కలయికను సాధించి నూతన సమాజ నిర్మాణమునకు దారి చూపించు చున్నవి. గాంధీ, నెహ్రూలు గత చరిత్రనుగూర్చి పట్టిగొప్పలు చెప్పుకొనుచు పగటికలలు కనుచు కూర్చుండలేదు భారతీయ సంస్కృతియందలి నిగ్గును అవగాహన చేసుకొని సత్యాహింసల ప్రాతిపదికతో, నవ భారత నిర్మాణ ప్రయత్నాలు ఆరంభించిన కార్యశూరులు వారు. అందు

చేత భారతదేశ పునరుజ్జీవనము సమగ్రమైన, సర్వతోముఖ, సాంస్కృతిక అభివృద్ధి ఉద్యమముగా పెంపొందు చున్నది. గ్రుడ్డి నమ్మకాలను, కాల దోషము పట్టిన సాంఘిక చాపస్తములను తొలగించుకొని సామ్రాజ్యతత్వ జాతి విచక్షణ విధానాలను ప్రతిఘటించి విధ్వంసమునకై అణుశక్తిని విని యోగించు ప్రయత్నాలను ధిక్కరించుచు, వ్యక్తి స్వాతంత్ర్యము, వ్యక్తి ప్రతిభ యొక్క పరిపూర్ణ వికాసమును కాంక్షించుచు, ప్రపంచ రాజ్యాల పరస్పర సహజీవనమును అభిలషించి, జగత్కల్యాణము గమ్యస్థాన ముగా నిర్ణయించుకొని భారతదేశము పురోగమించు చున్నది. ఈ పురో గమనము మనజాతిపునరుజ్జీవనమునకు జీవకళను, నిర్మాణశక్తిని, ప్రతి భానంపదను ప్రసాదించుచున్నది. ఈ విధముగా ప్రాతదానిలో నిగ్గును తీసు కొని సకల ప్రపంచములోని మంచిని ఆకళించుకొని, నూతన సమాజ నిర్మాణమునకు భారతదేశము కృషి జేయుచున్నది. ఈ కృషి మన సాంస్కృతిక రంగాలలో ప్రతిబింబితమగు చున్నది. ఈ ప్రతి బింబమే మన సాంస్కృతిక పునరుజ్జీవనము. గడచిన నూరు సంవత్సరా లలోని సాంస్కృతిక పునరుజ్జీవనముయొక్క స్థూల స్వరూప మిది.

భారత దేశమున 1857 వ సంవత్సరమున విదేశ పరిపాలనకు వ్యతిరేకముగా సైనికుల తిరుగుబాటు జరిగినది. ఇది సాధారణమైన తిరుగుబాటు కాదు. ఇది దేశ స్వాతంత్ర్యము కొరకు జరిగిన యుద్ధ ప్రక టనమే. దీనిని భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామమని శ్రీ వినాయక దామో దర్ సావర్కర్ వర్ణించినాడు. దీని తరువాత మన దేశములో ఈస్టిండియా కంపెనీ అధికార విరమణ జరిగి ఇంగ్లండు ప్రభుత్వముచే అధికార స్వీక రణ జరిగి ఇండియాలో బ్రిటిషు సామ్రాజ్య స్థాపన జరిగినది. భారత దేశమునకు విక్టోరియారాణి చక్రవర్తిని ఐనది. తరువాత మన దేశములో యుద్ధములంతమొంది ఇంగ్లీషు పరిపాలన శాంతముగా జరిగినది. ఇట్టి పరిస్థితిలో 1885 సంవత్సర డిసెంబరు 28 వ తేది మధ్యాహ్నము 12 గంటలకు బొంబాయిలోని గోకుల్‌దాస్ తేజ్‌పాల్ సంస్కృత కళాశాల

భవనమున భారత జాతీయ మహాసభ అవతరించినది. ఈ సమావేశము నందు ఆనాడు దేశమునందలి ప్రముఖులు చాల మంది పాల్గొనిరి. ఈ జాతీయ మహాసభ భారతీయులలో గాఢ దేశాభిమానము, తీవ్ర స్వాతంత్ర్యా కాంక్షలను రేకెత్తించి దేశ స్వాతంత్ర్యోద్యమము సాగించి, ప్రజలలో నూతన చైతన్యము కలుగజేసి అన్ని రంగాలలో పునరుజ్జీవనము సాధించి నది. మన దేశములో స్వాతంత్ర్య కాంక్షకు సాంస్కృతిక పునరుజ్జీవన ప్రయత్నాలకు జాతీయ మహాసభ స్థాపనతో అంకురార్పణ జరిగి నప్పటి కిని ఇందుకు అనుకూలమైన క్షేత్రము ఇంతకు ముందే సిద్ధము చేయబడె నది. ఈ కృషి చేసిన వారిలో ప్రథములు రాజా రామమోహనరాయలు. భారతదేశము ఈస్టిండియా కంపెనీ అధీనములో నున్నప్పుడె ప్రజల విద్యా సమస్యల యందు, సాంఘిక సమస్యలయందు రామమోహనరాయలు శ్రద్ధ తీసుకొని మనదేశ సాంస్కృతిక పునరుజ్జీవన కార్యకలాపాలకు బల మైన పునాది వేసినాడు.

ఈస్టిండియా కంపెనీ పరిపాలన వలన దేశములోని ఆర్థిక, సాంఘిక వ్యవస్థ దెబ్బతిన్నది. ప్రాచీన గ్రామ జీవన విధానము కంపెనీవారు నాశ నము చేసిరి. భారతదేశ పరిశ్రమలు ఈ కాలమున కూకటి వ్రేళ్ళతో పెల్ల గించి వేయబడెను. మన ఓడలు మాయమై పోయినవి. ఇంగ్లీషు వ్యాపా రము దేశమంతయు వ్యాపించినది. మన వ్యాపారము నన్నగిల్లినది. ఈ పతనము సాంస్కృతిక రంగములోనూడ కనపడు చున్నది. వేద శాస్త్ర పురాణశాస్త్రముల ప్రాధాన్యము తగ్గినది. వానిని చక్కగా అభ్యసించు వారి సంఖ్య దినదినము తక్కువ కాజొచ్చెను. దేశభాషల వ్యాప్తి కుంటు బడెను. వానిని ఆదరించువారు క్రమక్రమముగా తక్కువ కాజొచ్చిరి. ఇస్లాం మతవ్యాప్తి తగ్గి క్రైస్తవ మతవ్యాప్తి ఎక్కువ కాజొచ్చెను. ఆంధ్ర చిత్రకళ తన వ్యాప్తిని కోల్పోయెను. ఉత్తమ కవిత తక్కువ కాజొచ్చెను. అచ్చుయంత్రాలవతరించెను. ఇంగ్లీషువారు దేశీయుల విద్యను గూర్చి 1855 వరకు శ్రద్ధ తీసుకొనలేదు. 1855 లో కలకత్తా, బొంబాయి విశ్వ

విద్యాలయాలు నెలకొల్పబడినవి. ఇంగ్లీషు విద్య భారతదేశములో అడుగు పెట్టినది. ఈ ఇంగ్లీషు విద్యా ప్రచారమునుగూర్చి ఆ రోజులలో మన దేశమున తీవ్రమైన వాదోపవాదములు బయలుదేరినవి. రాజా రామమోహన రాయలు భారతీయులకు ఇంగ్లీషు విద్య అవసరమనియు ఆ విద్యా ప్రచారానికి మన దేశములో సంపూర్ణావకాశములు కలిగించవలెననియు వాదించి, ప్రభుత్వమును సమర్థించి ఇంగ్లీషు విద్యా ప్రచారానికి అండయై నిలిచెను.

1855 తరువాత భారతదేశమున పాశ్చాత్యవిద్యా ప్రవేశమును. గూర్చిన వాదోపవాదాలలో సాంస్కృతిక రంగమందలి భావసంఘర్షణ ప్రస్ఫుటమగు చున్నది. తరువాత ఈ భావ సంఘర్షణ మరింత తీవ్రముగా కన్పించు చున్నది. ఒక వైపున పాశ్చాత్యవిద్య, క్రైస్తవమతము, పాశ్చాత్యనాగరికత, వేష భాషలు, ఆచార వ్యవహారాలపై మోజు, ఇంకొక వైపున మనదేశ సాంప్రదాయాలు, ప్రాచీన సంస్కృతి విజ్ఞానాల పునరుద్ధరణ ఉద్యమాలు స్పష్టముగా కనపడు చున్నవి. 1858లో విశ్వవిద్యాలయాలు 1861-63ల మధ్య హైకోర్టుల స్థాపన జరిగి, ఆంగ్లవిద్య, ఆంగ్ల న్యాయ పరిపాలనా విధానములు మన దేశములో ప్రవేశపెట్టబడెను. రామమోహన రాయుల వంటివారు మన ప్రజల ఆచారములను నిరసించుచు, సంఘ సంస్కరణోద్యమమును బలపరచిరి.(వితంతు వివాహచట్టము, సహగమన నిరోధక చట్టము) ఆంగ్ల సభ్యతా సంపర్కమువలన ఆంగ్ల విద్యాధికులలో మానసిక పరివర్తనము ప్రారంభమైనది. బ్రహ్మసమాజ స్థాపనము జరిగినది. ఇందు వలన ఈ మానసిక పరివర్తనము వంగదేశమందంతటను ప్రత్యక్షమయ్యెను. వంగదేశమందలి ఉన్నత కుటుంబాలు కొన్ని క్రైస్తవ మతమునుకూడస్వీకరించెను. మరికొన్ని ఉన్నతకుటుంబాలు బ్రహ్మసమాజ మతమువలంబించెను. బ్రహ్మసమాజము దేశీయ ఆచార,సాంప్రదాయాలపైన నిరసన కలిగించిన తిరుగుబాటు ఉద్యమము. దీనిపైన పాశ్చాత్య వ్యామోహము స్పష్టముగా పడినది. దీనికి విరుగుడుగా పాశ్చాత్య విద్యతో వచ్చిన

అనార్య సాంప్రదాయములను, విపరీత సిద్ధాంతములను నిరోధించి, అవ సరమైనంత వరకు సంఘమును, మన సంస్కృతి కనుగుణముగ నడ రించు ఉద్దేశముతో ఆర్యసమాజము, దివ్యజ్ఞాన సమాజములు బయలు దేరినవి. ఇవి జాతీయోద్యమములు. దివ్యజ్ఞాన సమాజము ప్రాచ్యవిజ్ఞాన పునరుద్ధరణకు పనిచేసినది. భగవద్గీత దానికి ఆదర్శగ్రంథమైనది. అనిబిసెంటుగారు కాశీలో ఈ ఉద్దేశముతోనే కళాశాలను స్థాపించిరి. ప్రపంచములో పాశ్చాత్యులే అధికులను భావమును తొలగించి వారు నేర్చు కొనవలసినది ప్రాచ్యఖండమున చాలాకలదని తెలిపిన దీ దివ్యజ్ఞాన ఉద్యమము. ఇదే సందర్భమున వంగదేశమున రామకృష్ణపరమహంస అవతరించి, భారత జాతీయ వికాసానికి తోడ్పడిన రామకృష్ణ మఠమును స్థాపించెను. ఈ ఉద్యమము సకల ప్రపంచమునకు ఆధ్యాత్మిక రంగము నందు భారతదేశ ఆధిక్యమును రుజువు చేసినది. రామకృష్ణపరమహంస శిష్యుడైన వివేకానందుడు భారతీయ సంస్కృతి యందలి మహత్తును సభ్యజగత్తుకు ఎలుగెత్తి చాటినాడు. ఇట్టి వాతావరణములో భారత జాతీయ మహాసభ అవతరించినది. దీని ఉద్దేశము జాతీయ ఐక్యతాభావా లను కేంద్రీకరించి పెంపొందించుట. క్రమక్రమముగా ఈ సంస్థ శాఖోప శాఖలతో ఆసేతు హిమాచలము విస్తరించి ఒక మహాసంస్థగా రూపొంది మహోద్యమాలను నిర్వహించి భారతజాతికి స్వాతంత్ర్యము తెచ్చినది. "కాంగ్రెస్ మహాసభ దేశీయుల భావములను కార్యములను ఒక్క చోట కేంద్రీకరించినది. భారతదేశ మందలి లక్షలాది ప్రజలలో ఒక విధమైన ఆత్మ చైతన్యము పెంపొందించినది. వారికి ఆత్మ విశ్వాసము ఆశయ సంఘీభావము కల్పించినది. కాంగ్రెసు భారతీయుల భావములకు, కోరికలను స్పష్టమైన జాతీయ స్వరూపమిచ్చి వారి సమష్టి భాషా సాహిత్యములను, సమష్టి శిల్పపరిశ్రమ లను, సమష్టి వాంఛాదర్శములను, అన్నింటిని తిరిగి తెలుసుకొనుట కవకాశము కల్గించినది". ఈ విధముగా మన దేశములో నూతన భావో దయము, పునరుజ్జీవనము సర్వతోముఖముగా గోచరించినవి.

పైన వివరించిన అఖిలభారత ఉద్యమము లన్నియునుగూడ ఆంధ్ర దేశమున అవతరించి, ఆంధ్రదేశ సాంస్కృతిక పునరుజ్జీవనమునకు దోహదము గావించినవి. పాశ్చాత్య వ్యామోహము, దానిపై తిరుగుబాటు, సంఘ సంస్కరణము, ప్రాచీన ఆచారాలపైన మక్కువ, బ్రహ్మసమాజము, దివ్యజ్ఞాన ఆర్యసమాజాలు, వీని అన్నింటితోపాటు జాతీయోద్యమ వ్యాప్తి, కాంగ్రెస్ ఉద్యమము ఆంధ్రదేశ ప్రజానీకమునకు నూతన చైతన్యము కలిగించినవి. తెలుగుదేశములోని ఈ పరిస్థితిని శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఇట్లు వర్ణించినారు. "........1857 నాటికి దేశీయులైన హిందూ ప్రభువుల, ముస్లిం నవాబుల స్వతంత్రాధికారము అంతరించినది. వారందరు బ్రిటిషు వారి సామంతులైనారు. ఇంగ్లీషు రాజభాష యైనది. ప్రభుత్వ ఉద్యోగాల నిమిత్తము జనము కావలసి వచ్చి కుంపిణీవారు పాఠశాలలు పెట్టినారు. విద్య ఇంగ్లీషులో నేర్పినారు. ఆంగ్ల పాఠశాలల్లో చదువుకోటానికి జనులందరికి సమాన అవకాశాలు ఏర్పడినవి. ఆంగ్ల సాహిత్యానికి దేశములో ఆదరణ హెచ్చినది. ఆంగ్ల వాఙ్మయానికి ప్రచార మధికమయినది. ఆంగ్ల భాష చదివిన వారికే ఉద్యోగాలు, ఇంగ్లీషువారి సంస్థల మీద, పద్ధతుల మీద ఆంగ్ల విద్యాధికులకు గౌరవము మోజు ప్రబలినది. జనులలో భౌతికశాస్త్రజ్ఞానము అతిశయించినది. హేతు వాదముల మీద అభిరుచి కలిగినది.

పరిపాలనలో పూర్వపు కట్టుబాట్లు పద్ధతులు పోయినవి. గ్రామ పంచాయతీ పరిపాలన శిథిలమైనది. దేశపరిపాలనకు కలెక్టర్లు నియమితులైనారు. రైల్వేలు వచ్చి ప్రయాణము తేలికయైనది. పోస్టు సౌకర్యాలు లభించినవి. దేశము అరాజకములో నుండి బయటపడినది. జనులు తాము సుఖపడుతున్నట్టనుకొని ఒక నిట్టూర్పు విడిచారు.

కులముల, వర్ణముల ఎక్కువ తక్కువ విభేదాలు క్రమక్రమముగా నమసిపోయినవి. ఆదరణ పోషణల నిమిత్తము హిందూమతము నేడు రొక్కనవలసి వచ్చెను. వేదవిద్యలు ఎండిపోయిన కాలమది. ఈ కాల

ములో బ్రాహ్మణులకు వెనుకటి ప్రాముఖ్యము పోయినది. సంఘములో అతనికి వెనుకటి పెద్దరికము తరిగింది. అనర్థకమైన ఆచారాలు అర్థము లేని విశ్వాసాలు, చీడపురుగుల లాగా పట్టుకొని సంఘమును పీడించినవి. ఐనదీ కానిది మతమను పేరుతో సమర్థితమైనవి, పాశ్చాత్యమున్నవానికల్లా విలువ హెచ్చిన ఈ కాలంలో ప్రాచీన జీవం నిలుపుకొనడానికి పెనుగు లాడింది. అది ప్రాచీన, నవీన ప్రాచ్య పాశ్చాత్య సభ్యతలను, సంస్కృతులకు సంఘర్షణ రేకెత్తిన కాలమది. ఈ పాతకొత్తల సంధికాలములోనే 1848లో జన్మించినాడు శ్రీ కందుకూరి వీరేశలింగం."

ఆంధ్రదేశంలోని సాంస్కృతిక పునరుజ్జీవనము వీరేశలింగం పంతులుగారి వాఙ్మయ విహారముతోనే ప్రారంభమైనదని చెప్ప వచ్చును. భారతదేశములోని పరిస్థితులు ఇంచుమించుగా అన్నియును ఆకాలమున ఆంధ్రదేశమందు కూడ వ్యాపించి యుండెను. ఆంధ్రులు దేశములోని అన్ని ఉద్యమాల యందు నాయకత్వము వహించి, జాతి నిర్మాణ కార్యక్రమమున ముందడుగు వేసియున్నారు. కాలదోషము పట్టిన పాత ఆచారాలపై తిరుగుబాటు, పాశ్చాత్య నాగరికతపైన వ్యామో హము, ఇంగ్లీషు పరిపాలన ఎడల మక్కువ, ప్రాచీన విజ్ఞాన పునరుద్ధరణ అభిలాష, జాతీయోద్యమ ఫలితముగా అంకురించి మొలకెత్తిన స్వదేశాభి మానము, రెండు భిన్న అభిప్రాయాలమధ్య భావ సంఘర్షణ ఈ కాలమున తెలుగుదేశ మందలి ఇతర ఉద్యమాలన్నిటి యందు సాంస్కృతిక ఉద్య మమందుకూడ ప్రస్ఫుటముగా కనపడుచున్నవి.

భారతదేశమున గడచిన శతాబ్దాంతము, మరియు ఈ శతాబ్దాది కాలమును మేధావి యుగమని చెప్పవచ్చును. దిగ్దంతులైన అతిరథులు అన్ని రంగాల యందు కన్పట్టుచున్నారు. ఉద్దండులైన న్యాయవాదులు, న్యాయశాస్త్రమున నిష్ణాతులైన న్యాయమూర్తులు, గణనకెక్కిన విద్వాం సులు, ఆంగ్లభాషను అరచేతి నిమ్మపండుగా ఆడించగలిగిన విద్యా ధికులు, వక్తృత్వము నందు ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ప్రతివాది



భయంకరులు, జాతికి నూతన చైతన్యము ప్రసాదించ గలిగిన రచయితలు, మేధానిధులైన విజ్ఞానులు, ధైర్యసాహసాలు, స్వార్థత్యాగము మూర్తీభవించిన దేశభక్తులు ఈ కాలమునందు అన్ని రాష్ట్రాలలో ఉదయించిరి. బెంగాలులో ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు, బంకించంద్ర ఛటర్జీ, సురేంద్రనాధబెనర్జీ, జగదీశచంద్రబోస్, ప్రఫుల్లచంద్రరాయ్, చిత్తరంజనదాసు, అశుతోషముఖర్జీ, అరవిందుడు, రవీంద్రుడు అవనీంద్రుడు ఆవిర్భవించి వంగదేశము భారతదేశమునకు మార్గదర్శకమైన నాయకమణి అయ్యెను. మహారాష్ట్ర దేశమున గోపాలకృష్ణ గోఖలే, బాలగంగాధర తిలక్, మహాదేవగోవింద రానడే, రామకృష్ణ భండార్కర్, కర్వే, జయకర్, సవర్కర్లు బయలుదేరి తమ రాష్ట్రమునకు జీవము పోసిరి. సంయుక్త రాష్ట్రమున మదన మోహన మాలవ్యా పండితుడు ముందుకు వచ్చి, కాశీ విశ్వవిద్యాలయమునకు రూపురేఖలు దిద్ది భారత జాతీయ రంగమున దేదీప్యమానముగా ప్రకాశించెను. మోతీలాల్ నెహ్రూ, తేజ్‌బహద్దూర్ సప్రూ, మున్షీ ప్రేంచంద్‌లు సంయుక్తరాష్ట్ర ప్రజాహిత జీవనమున అగ్రేసరులుగా నిలచిరి. తమిళదేశమునకు సేలం విజయరాఘవాచార్య, శ్రీనివాసశాస్త్రి, కస్తూరిరంగ అయ్యంగారు, శ్రీనివాస అయ్యంగార్, రాజగోపాలాచార్య, చంద్రశేఖర వెంకటరామన్ ప్రభృతులు నవజీవనము ప్రసాదించిరి. పంజాబు రాష్ట్రమున లాలా లజపతిరాయ్, సరిహద్దు రాష్ట్రమున ఖాన్ అబ్దుల్ గఫ్ఫార్‌ఖాన్‌గారలు నాయకత్వము వహించిరి. ఈ మహనీయుల వ్యక్తిత్వాల ప్రభావము, రాజకీయరంగము నందే కాక సాంస్కృతిక రంగమునందు కూడ స్పష్టముగా కనపడు చున్నది. ఇదే విధముగా తెలుగుదేశమున కందుకూరి వీరేశలింగం పంతులు, రఘుపతి వెంకటరత్నం నాయుడు, కాశీనాథుని నాగేశ్వర రావు, కొండా వెంకటప్పయ్య, టంగుటూరి ప్రకాశం, ముట్నూరి కృష్ణా రావు, పట్టాభి సీతారామయ్య, డాక్టర్ రాధాకృష్ణ, కట్టమంచి రామలింగా రెడ్డి, సి. చింతామణి, మోక్షగుండం విశ్వేశ్వరయ్య, ఉన్నవ లక్ష్మీనారా

యణ, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, కొమర్రాజు వెంకట లక్ష్మణరావు, గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు, దామెర్ల రామారావు, న్యాపతి సుబ్బారావు, మాడపాటి హనుమంతరావు ప్రభృతులు ఉదయించి ఆంధ్రజాతికి జీవము పోసిరి; తెలుగుదేశమునకు నూతన చైతన్యము కలిగించిరి. తత్ఫలితముగా ఆంధ్రదేశములో నవోదయమైనది. సాంస్కృతిక పునరుజ్జీవనమునకు మార్గము సుగమము చేయబడినది.

ఆంధ్రదేశములో సాంస్కృతిక పునరుజ్జీవమునకు కొన్ని ఉద్యమములు కారణభూతములైనవి: లార్డు కర్జన్‌చేసిన బంగాళా విభజన ఫలితముగా వంగీయులు అగ్రహోదగ్రులై ఆందోళన మొదలిడిరి. అందువలన స్వారాజ్య వాంఛయు జాతీయతాభిమానము ప్రబలినవి. వంగనాయకుడు విపిన చంద్రపాల్ ఇతర రాష్ట్రాలతోపాటు ఆంధ్రదేశ పర్యటన గావించెను. శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు విపిన చంద్రపాలును మచిలీపట్నమున కాహ్వానించి ఆయన దివ్యవాణిని ఆంధ్రదేశమునకు పరిచితము గావించిరి. బంగాళా విభజనవలన కలిగిన రాజకీయవాతావరణము ఆంధ్రరాష్ట్రవాంఛకు చేయూతనిచ్చినది. బ్రహ్మసమాజము అనాటి కొందరి విద్యాధికులను ఆకర్షించెను. శ్రీరఘుపతి వెంకటరత్నం నాయుడు, వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగార్లు బ్రహ్మసమాజముచే ప్రభావితులైరి. ఇతర మత భాషా సాంస్కృతికాది ఉద్యమాలు కూడ ఆంధ్రదేశ సమాజ జీవనముపై తమ ప్రభావము వేసినవి. ఆర్యసమాజము, దివ్యజ్ఞానము, వివేకానంద, రామకృష్ణ పరమహంసల ప్రబోధములు ఈనాడాంధ్ర దేశమున బహుళవ్యాప్తి గాంచినవి. వీనితోపాటు సంఘ సంస్కరణోద్యమము, విశేషించి వితంతు వివాహ ఉద్యమము తెలుగు దేశమున ప్రధాన సాంఘిక ఉద్యమముగా ప్రాముఖ్యము వహించినది. దీనిపైన పత్రికలలో వాదోపవాదాలు అతిశయించి పరస్పర దూషణ భూషణల వరకు కూడ వచ్చి యుండెను. ఈ ఉద్యమాలన్నింటిలో బలవత్తరమైనది జాతీయోద్యమము. ఈ జాతీయోద్యమము వెల్లువ వలె

పెల్లుబికి ఆంధ్రదేశము నంతటిని ఉత్సాహతరంగితము గావించినది. లోకమాన్యతిలక్, గాంధీ మహాత్ముడు ప్రారంభించిన స్వాతంత్ర్యోద్యమాలలో ఆంధ్రదేశీయులు ధైర్యముతో, త్యాగముతో అగ్రేసరులుగా నిలిచి పోరాడినారు. మాకొద్దీ తెల్లదొరతనము అని కవులు సోదర దేశీయులను ప్రబోధించినారు. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణునివంటి వారు తమ వక్తృత్వమును, సాహిత్యమును, ఉత్తమ సంస్కారమును, సర్వతోముఖ ప్రతిభను దేశీయులను నిద్రావస్థ నుండి లేపి కర్తవ్య పరాయణులగా చేయుటకు వినియోగించినారు. జాతీయవాదులు మన ప్రాచీన విజ్ఞానమును పునరుద్ధరించి జాతీయ విద్యను బోధించుటకై, సంస్కృత పాఠశాలలను జాతీయ కళాశాలలను నెలకొల్పినారు. కళారంగమున భారతీయ సాంప్రదాయమునకు ప్రాధాన్యము నీయవలెననుఅభిప్రాయములు బలపడినవి. సమకాలిక సమస్యలైన హరిజనోద్ధరణ మొదలైనవి ఆనాడు వాఙ్మయమున ప్రధాన ఇతివృత్తములైనవి. జాతీయభావాల ప్రేరణ వలన తెలుగు భాషలో ఉత్కృష్ట రచనలు చేయబడినవి. కవులు, కళాకారులు, విజ్ఞానులు చెఱసాలల కేగిరి. ఆంధ్రోద్యమము, ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర వాంఛ ఈ జాతీయోద్యమముతో బాటు తెలుగు సీమయందు నలుమూలల వ్యాపించి అన్ని రాజకీయ పక్షాలవారి ఆదరాభిమానములకు పాత్రమైనది. ఆంధ్ర ప్రశస్తిని గూర్చి, రాష్ట్ర అవశ్యకతను గూర్చి కవీశ్వరులు గానము గావించిరి. "చావలేదు చావలేదు ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర అని ఉద్బోధించిరి. ఆంధ్రదేశ చరిత్రలోని వీరగాథలను భావనా పథమున స్మరించి తాము పులకితులై పాఠకులను తన్మయులను గావించిరి. తరువాత రాజకీయ రంగమున 1935 వ ప్రాంతమున కమ్యూనిస్టుపార్టీ తలయెత్తినది. ఈ పక్షానికి ప్రత్యేక రాజకీయ ఆదర్శాలు గలవు. తమ రాజకీయ సిద్ధాంతాలకు, ఆదర్శాలకు అనుగుణముగా సాంస్కృతిక కార్యకలాపాలలో గూడ ఈ పక్షమువారు శ్రద్ధ వహించిరి. రచయితల సంఘాలు, వేసవి పాఠశాలలు, దినపత్రికలు, వారపత్రికలు, బుర్రకథలు

నాటకాలు,పుస్తకాల ప్రకటన మొదలైన సాంస్కృతిక కార్యకలాపాలలోవీరి రాజకీయ ఆదర్శాలు ప్రతిబింబితమగు చున్నవి. 1913 సంవత్సరమున ప్రారంభమైన ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఉద్యమము, ప్రత్యేక విశ్వవిద్యాలయ వాంఛను రేకెత్తించినది. తత్ఫలితముగా కొంత ప్రయత్నము జరిగి ఆంధ్ర విశ్వకళా పరిషత్తు 1926 లో అవతరించినది. ఆంధ్రదేశము నందలి కళాశాలలు, రాయలసీమవి తప్ప; ఆంధ్ర విశ్వవిద్యాలయమున కనుబంధములైనవి. ఆంధ్రవిశ్వవిద్యాలయములో ఇతర విశ్వవిద్యాలయ ములలో లేని కొన్ని కొత్త కోర్సులు ఏర్పాటు చేయబడినవి. అందువలన వైజ్ఞానిక రంగమున నూతన పరిశోధనలకు అవకాశము కల్గించబడినది. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన విద్వన్మణులైన కట్టమంచి రామలింగారెడ్డి, సర్వేపల్లి రాధాకృష్ణ గారల నేతృత్వము యొక్క అదృష్టము లభించినది. ఆంధ్రరాష్ట్రమున ఉన్నత పాఠశాలలు, కళాశాలలు విరివిగా స్థాపించబడినవి.

రాజకీయ, సాంఘిక ఉద్యమాలతోపాటు ఈ కాలమున కొన్ని ముఖ్యమైన వాఙ్మయోద్యమాలు కూడ బయలుదేరినవి. చరిత్ర పరిశోధన ఉద్యమము మొట్టమొదట చెప్పవగినది. ఇంగ్లీషువారు వ్రాసిన వ్రాతలే మన చరిత్రకు వేదవాక్యాలవలె ఆధారములై యుండిన పరిస్థితిలో మన చరిత్ర గ్రంథాలలో దక్షిణదేశము యొక్క అందు ముఖ్యముగా ఆంధ్ర దేశ చరిత్రయొక్క వివరాలు మిక్కిలి తక్కువగా నుండెను. ఈ లోటు తీర్చుటకు మన పరిశోధకులు కృషి గావించిరి. మన కవుల జన్మ స్థానాలు, వారి జీవిత కాలము మరియు ఇతర వివరాలను గూర్చి కందుకూరి వీరేశలింగం పంతులుగారు, ఆంధ్రదేశ చరిత్రను గూర్చి చిలుకూరి వీరభద్రరావుగారు, మన శాసనాలు, చరిత్ర రచనకు వినియోగపడుసాధన సామగ్రిని గూర్చి కొమర్రాజు లక్ష్మణరావుగారు పరిశోధనలు గావించి ఉత్తమ రచనలుచేసి మార్గదర్శకులైరి. శాసనాల ప్రతిబింబాలు సంపాదించి ప్రకటించుట, జీర్ణమైపోవుచున్న తాళపత్ర గ్రంథాలు సేకరించి

ప్రకటించుట, ఆనాటి పరిశోధకుల ముఖ్యకృషియై యుండెను. ఆంధ్ర సాహిత్య పరిషత్తు శ్రీ జయంతి రామయ్య పంతులుగారి అధ్వర్యమున చరిత్ర పరిశోధనోద్యమమునకు, గొప్ప అండయై నిలిచినది. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, నేలటూరి వెంకటరమణయ్యగారు, కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, డాక్టరు శ్రీనివాసాచార్యులుగారు చేసిన కృషి ఈ సందర్భమున ప్రత్యేక స్మరణీయము. ఆంధ్రదేశము మరియు ఆంధ్ర వాఙ్మయములకు సంబంధించిన పరిశోధనా కృషి మన సాంస్కృతిక పునరుజ్జీవనానికి మహోపకారము కావించినది. రాజమహేంద్రవరమున ఆంధ్ర దేశీయైతిహాసిక పరిశోధక మండలి ఆవిర్భవించినది.

ముద్రణాలయాలు వ్యాపించి పత్రికలు ప్రారంభమై మన దేశమున సాంస్కృతిక కార్యకలాపాలకు అనుకూలమైన వాతావరణము కలిగినది. ప్రచురణకర్తలు పూర్వగ్రంథాలను అచ్చువేయుటేకాక ఆధునిక రచయితల పుస్తకములను ప్రకటించి మన సాంస్కృతికోద్యమానికి దోహదము కావించిరి. ఈ మార్గమున మన పత్రికలు ముఖ్యముగా ఆంధ్రపత్రిక చేసిన సేవ అమోఘమైనది. అది స్వర్ణాక్షరములతో లిఖింపదగినది. తిరుపతి కవుల మార్గదర్శకత్వమున అవధానాలు, ఆశుకవితా ప్రదర్శనాలు ఆంధ్రదేశమున ఒక్కమారు గాలిదుమారము లేపినవి. తీవ్రమైన సాహితీ పిపాస కలిగించినవి. సాహితీసమరములు వాఙ్మయాభిమానమును ఇతోధికము కావించినవి. ఊరూర అవధానాలు, ఆశుకవితా ప్రదర్శనాలు తలయెత్తినవి. పల్లెపల్లెన జంటకవులు బయలుదేరిరి. అధిక్షేప రచనలు పత్రికలలోనేకాక, గ్రంథరూపమున కూడ వెలువడినవి. నాటక ప్రదర్శనాలు తెలుగుసీమ నంతటిని ఆకర్షించినవి. కవిత్వము నల్లనేర్చిన యువకులనేకులు నాటకరచనకు సాహసించిరి. నాటక సమాజములు అసంఖ్యాకములుగా బయలు వెడెను. కొన్ని నాటక సమాజములను స్వయముగా గ్రంథ కర్తలే నిర్వహించి పాత్రలను కూడ ధరించిరి. ఉద్దండులైన పండితులు, ఈ కాలమున నాటకాలు రచించి నాటక

ప్రదర్శనాలను అభిమానించిరి. ఈ నాటక ప్రదర్శనాలవలన అవధానాల వలన, పరస్పర అధిక్షేపరచనల వలన ఆంధ్రదేశమున సారస్వతాభిరుచి, వాఙ్మయాభిమానము ప్రబలినవి. ఈ ఆశుకవిత్వ అవధానాలే, ఈ నాటక ప్రదర్శనాలే ఆకాలమున రాజకీయముగా వేరుపడి పరస్పరము రాకపోకలు లేక, ఒకరిని గూర్చి ఒకరికి సరిగా తెలియక యుండిన ఆంధ్ర తెలంగాణా ప్రజల మధ్య ఏకైక బంధముగా నుండెనని చెప్పినచో సత్యమునకు తలవంపులు కలుగ జాలవు.

తెలుగుసీమలో కొన్ని ముఖ్యమైన విద్యాసంస్థలు వెలసి జాతీయ విద్య ప్రాచీన విజ్ఞాన పునరుద్ధరణకు దోహదము కావించినవి. సంస్కృత కళాశాలలు, పాఠశాలలు చాలా చోటులలో స్థాపితమైనవి. బందరులో జాతీయ కళాశాల అవతరించినది. గుంటూరులో శారదా నికేతనము స్థాపితమయ్యెను. జాతీయ విద్య ఒక ఉద్యమముగా దేశములో వ్యాపించెను.

ఆంధ్రదేశము సంపలి వైజ్ఞానిక ఉద్యమములో చెప్పదగినది గ్రంథాలయోద్యమము. తెలుగుసీమలో అప్పటికే గ్రంథాలయాలు కొన్ని అవతరించినప్పటికి 1914 వ సంవత్సరములో ఆంధ్రదేశ గ్రంథాలయ స్థాపనతో ఈ ఉద్యమానికి చాలా బలము కలిగినది. నాటికిని నేటికిని ఈ ఉద్యమము సక్రమముగ శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు నిర్వహించుచున్నారు. గ్రంథాలయ సర్వస్వము అను పత్రికను నడపి, గ్రంథాలయోద్యమ వ్యాప్తికి పాటుపడిన వారిలో శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యగారిని ప్రత్యేకముగా ప్రశంసించవలసియున్నది. శిక్షణ తరగతుల నడిపి, పత్రికను నిర్వహించి, సమావేశాలు జరిపించి, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారు ఈ ఉద్యమమును సకలాంధ్ర వ్యాప్తముతో నడుపుచున్నారు. ఆంధ్ర తెలంగాణాల మధ్య సాంస్కృతిక సంబంధాల అవశ్యకతను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమువారు గుర్తించిరను సత్యము మనము గమనింపవలసి యున్నది. ఈ అవశ్య

కతనుమొట్టమొదటసారిగుర్తించినఆంధ్రవిజ్ఞానులు కీ. శే. శ్రీకొమర్రాజులక్ష్మణరావుగారు.ఆంధ్రదేశగ్రంథాలయస్థాపనకొక దశాబ్దమునకు ముందే లక్ష్మణరావుగారు విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలిని హైదరాబాదులో స్థాపించిరి. ఈ విధముగా విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలివారు గ్రంథములను ప్రకటించుటయే గాక విజ్ఞాన చంద్రికా పరిషత్తును యేర్పరచి సాహిత్యము, చరిత్ర, ప్రకృతి శాస్త్రము అను మూడు విషయాలను గూర్చి పరీక్షలు జరిపినారు. ఈ పరిషత్తునకు వీరేశలింగం పంతులుగారు అధ్యక్షులు గను, వావిలికొలను సుబ్బారావుగారు ఉపాధ్యక్షులు గను ఉండిరి. పరిషత్తు వారు పరీక్షలు జరిపి బంగారు పతకములను రు 116, రు 50 లు బహుమతుల నిచ్చుచుండిరి. హైదరాబాదు కూడ యీ పరీక్షలకు ఒక కేంద్రముగా నుండెను. ఈ పరీక్షలలో హైదరాబాదు వారు కూడ కొందరు కూర్చొని యుండిరి. ఆంధ్ర భాషలో పరీక్షలు జరిపిన మొట్టమొదటి ప్రైవేటు సంస్థ విజ్ఞాన చంద్రికా పరిషత్తే. తెలుగులో యీ పరీక్షా విధానమునకు మూల పురుషులు లక్ష్మణరావుగారే. తరువాత హైదరాబాదులో ఇట్టి పరీక్షలను జరుపవలసినదని ఆంధ్రమహాసభను శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు కోరియుండిరి. కాని దానికి ఆనాడు ఆంధ్ర మహాసభ కార్యరూపము నీయలేదు. తరువాత ఆంధ్ర సారస్వత పరిషత్తు యీ పరీక్షలను నెలకొల్పి జయప్రదముగా నిర్వహించుచున్నారని యీ సందర్భమున మనము గమనించవలసి యున్నది. విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి వారు ఆంధ్ర చరిత్రకు సంబంధించిన నవలా రచన పోటీ పరీక్షలు కూడ పెట్టి యుండిరి. ఇది కూడ ఇటువంటి ప్రయత్నాలలో మొట్టమొదటిదే. రాయచూరు యుద్ధము, విజయనగర సామ్రాజ్యము, పాతాళభైరవి అను పోటీ నవలలు యీ గ్రంథమాలలో ప్రకటితమైనవి. లక్ష్మణరావు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ రచనకు కూడ మార్గదర్శకులు. వారు విజ్ఞాన సర్వస్వము మొదట సంపుటము. తమ జీవిత కాలములోనే సిద్ధము చేయించిరి. లక్ష్మణరావుగారి ఆదర్శాలు రెండు. చరిత్ర పరి

శోధన, విజ్ఞాన వాఙ్మయ నిర్మాణము. ఈ ఉద్యమముల ద్వారా లక్ష్మణరావుగారు ఆంధ్ర తెలంగాణాల మధ్య ఒక దృఢమైన సాంస్కృతిక బంధమును ఏర్పాటు గావించి, తెలుగుసీమకు వెలుగుబాట చూపిరి. అందుచేత విశాలాంధ్రోద్యమమును ఊహించి, ఉద్దేశించి, సాంస్కృతికముగా బీజావాపన గావించిన గౌరవము లక్ష్మణరావుగారికి చెందుచున్నది. ఆంధ్రదేశ మహాపురుషులలో లక్ష్మణరావుగారికి విశిష్టమైన ప్రత్యేక స్థానము కలదు. యువకులలో నివురుగప్పిన నిప్పువలె దాగుకొనియున్న ప్రతిభను గుర్తించి, తద్వికాసమునకు సకల విధముల సాహాయ్యము గావించిన వారిలో తెలుగుసీమ యందు లక్ష్మణరావుగారు అగ్రగణ్యులు. వారి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి ప్రచురణలను పరిశీలించినప్పుడు చిలుకూరి వీరభద్రరావు, కట్టమంచి రామలింగారెడ్డి, అయ్యదేవర కాళేశ్వరరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, డాక్టరు ఆచంట లక్ష్మీపతి, గోటేటి జోగిరాజు, వేమూరి విశ్వనాథశర్మ మొదలైన పెద్దల రచనలు అందు కనిపించు చున్నవి. అనగా ఆనాడు యువకులుగానున్న ఈ పెద్దలకు లక్ష్మణరావుగారి ప్రోత్సాహము లభించినదని తెలియుచున్నది. నేడు ఆంధ్ర విద్వన్మణులలో దివ్యమణియై, ఆంధ్రదేశ చరిత్ర పరిశోధకులలో అగ్రేసరులై ప్రకాశించుచున్న పూజ్యులైన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, ఆనాడు లక్ష్మణరావుగారి సాహచర్యముచే ప్రభావితులైన వారే. అఖిలాంధ్ర కవిలోకమునకు ఆచార్యులై, ఆంధ్రుల యశోగానము చేసి నెల్లూరు ఆంధ్రమహాసభలో నాయకులను కవితచే ఐక్యము గావించి, సకలాంధ్రమును ఉత్తేజితము గావించిన శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు లక్ష్మణరావుచే ప్రభావితులైన మరొకరు.

మచిలీపట్నములో ఆంధ్ర భాషాభివర్ధనీగ్రంథమాల విజ్ఞాన చంద్రికవలెనే, బహుశా విజ్ఞాన చంద్రిక ఆదర్శము ననుసరించియే స్థాపితమై మంచి గ్రంథములను ప్రకటించినది. ఈ గ్రంథమాల ప్రచురణలలో డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు రచించిన పుస్తకాలు కలవు.

వ్యావహారిక భాషోద్యమము ఈ కాలమున వచ్చిన ఉద్యమాలన్నింటిలో మిక్కిలి ప్రధానమైనది. భాషోద్యమము పైనగూడ కొంత పాశ్చాత్యుల ప్రభావము కలదు. కాడ్వెలు ద్రావిడ భాషా సాంప్రదాయ సిద్ధాంతమును ప్రతిపాదించెను. వాడుక భాషలో రచనలు గావించవలెనని శబరవాగను శాసనములు, సంస్కృతాంధ్ర భాషా సముద్రములను అపోశనము పట్టిన అగస్త్యులైన శ్రీ గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారు ఉద్ఘాటించి, పాంచజన్యమును పూరించిరి. గురుజాడ అప్పారావుగారు "ముత్యాలసరాలు", "కన్యాశుల్కము" లను రచించి, వ్యావహారిక భాషలో రచనలకు మార్గదర్శకులైరి. ఇది తెలుగు పండిత ప్రపంచములో గొప్ప అలజడి, ఆంధ్ర వాఙ్మయమున తీవ్ర సంచలనమును కలుగజేసినది. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు, జయంతిరామయ్య పంతులుగారు మొదలైన పెద్దలు వ్యావహారిక భాషోద్యమమును ప్రతిఘటించి విశ్వవిద్యాలయము చేత వాడుక భాషలో రచించిన పాఠ్యగ్రంథములను నియమించ గూడదను తీర్మానము చేయించిరి. గిడుగు రామమూర్తి పంతులుగారు, వెంకటరాయ శాస్త్రులుగారి వంటి పండితులు వ్రాసిన పుస్తకాలలో తప్పులు నిరూపించి, ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజమును లోకానికి తెలియజేసిరి. కాలక్రమమున వ్యావహారిక భాషోద్యమము సజీవమైన ఉద్యమముగా రూపొంది పండితులు, రచయితలు రామమూర్తి పంతులుగారి వాదనలోని సత్యము గ్రహించిరి. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి వంటివారు వ్యావహారిక భాషలో రచనలు గావించిరి. ఆనాడు అంత తీవ్ర ప్రతిఘటనకు గురియైన ఉద్యమము నేడు సకలాంధ్రము యొక్క ఆమోదము పొందినది. కాని విశ్వవిద్యాలయముల అంగీకార ముద్ర మాత్రము ఇంకను దీనిపైన పడలేదు. ఆనాడు యీ మనీషుల స్పర్ధవలన ఆంధ్ర వాఙ్మయమునకు విలువలేని రత్నములు లభించినవి.

ఆంధ్రదేశములో సాంస్కృతిక పునరుజ్జీవనమునకు బలమైన పునాదులు వేసిన సంస్థలను యీ సందర్భమున పేర్కొనవలసి యున్నది:

పిఠాపురము మహారాజా వారి పోషకత్వమున స్థాపించబడి, నిర్వహించ బడిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు చేసిన సాంస్కృతిక సేవ మిక్కిలి గొప్పది. ఈ సాహిత్య పరిషత్తుకు జయంతి రామయ్య పంతులుగారు జీవగఱ్ఱయై యుండిరి. ప్రతి సంవత్సరము వార్షికోత్సవాలు జరిపి, ఒక సారస్వత మాసపత్రికను ప్రకటించి, తాళపత్ర గ్రంథాలను సేకరించి ప్రకటించి, చరిత్ర పరిశోధన సామగ్రిని శ్రమతో సంపాదించి. తరువాత సూర్యరాయాంధ్ర నిఘంటువును ప్రకటించి. ఈ సంస్థ నిరుపమానమైన సేవ చేసినది. ఆనాడు ఆంధ్రదేశమున యీ సంస్థ ఒక గొప్ప సాంస్కృతిక కేంద్రముగా నుండెను. కాని కాల ప్రభావమున వచ్చిన మార్పులను స్వీకరించ లేకపోయినందున భాషా విషయమై, రచన విషయమై క్రొత్త దనమును వ్యతిరేకించినందువలన యీ సంస్థ యువకులకు, నూతన మార్గాన్వేషకులకు, కాలముయొక్క మార్పులను గుర్తించిన సహృదయు లైన విద్వాంసులకు దూరమైనది. దీనిపై తిరుగుబాటుగా నవ్యసాహిత్య పరిషత్తు ఉదయించినది. నవ్యసాహిత్య పరిషత్తుకు కొంచము ముందుగా ఆధునిక భావ విలసితులైన యువకుల ఆధ్వర్యమున సాహితీ సమితి స్థాపితమై తెలుగు వాఙ్మయ రంగమున క్రొత్తదారులను వేసినది. ఆంధ్రదేశ ఇతిహాస పరిశోధక మండలి వారు వార్షిక సభలను జరిపి, చాళుక్య, కాకతీయ, శాతవాహనాది సంచికలను ప్రకటించి, పరిశోధనోద్యమమును బలపరచిరి. అభ్యుదయ రచయితల సంఘము స్పష్టమైన ప్రత్యేక ఆదర్శ ములతో ముందుకు వచ్చినది నవ్యసాహిత్య పరిషత్తు స్థాపనకు పూర్వమే ఆంధ్ర ప్రచారిణీ, సరస్వతీ, వేగుచుక్క గ్రంథమాలలు స్వతంత్రములు మరియు భాషాంతరీకరణములైన నవలలను ప్రకటించి మన దేశమున భాషా భిరుచి కలుగ జేసినవి. ఇంతకుముందే వావిళ్ళవారు మద్రాసు నగరము నుండి మన ప్రాచీన వాఙ్మయము ప్రకటించుట ప్రారంభించి, భాషా వ్యాప్తికి వాఙ్మయాభిరుచికి అత్యంత సహకారులైరి. ఇతర ఆంధ్ర ప్రకాశకుల ప్రచురణలు గూడ ఆంధ్రదేశములోని సాంస్కృతికోద్యమానికి బల

మైన ఊత నిచ్చెను. ఇటీవల వచ్చిన సంస్థలలో తెలుగు భాషా సమితిని ప్రత్యేకముగా ప్రశంసింపవలసి యున్నది. ఇది 1947 వ సంవత్సరములో స్థాపితమైనది. తెలుగు విజ్ఞాన సర్వస్వ సంపుటాలను ప్రకటించుచు ప్రతి సంవత్సరము వివిధ విషయాలలో ఉత్తమ గ్రంథాలకు బహుమతుల నిచ్చుచు యీ సంస్థ చేయుచున్న కృషి ప్రశంసనీయమైనది.

ఈ సాంస్కృతిక పునరుజ్జీవనమున యీ కాలమున తెలుగు సీమలో కొన్ని పట్టణాలు అటపట్టులై వెలసి యున్నవి. రాజమండ్రి వేయి సంవత్సరాల నుండి ఆంధ్ర సంస్కృతికి ఆంధ్ర చరిత్రకు ప్రధాన కేంద్రము. ఆధునిక కాలమున ఆంధ్రదేశములో నవయుగోదయ భానుడైన వీరేశలింగం పంతులుగారి నివాసస్థానము వారి వివిధ కార్యక్రమాలకు రంగస్థలమైనది యీ పట్టణము. ప్రకాశం పంతులుగారికి కూడ యీ పట్టణమే కొంతకాలము కార్యరంగమైనది. శ్రీ దామెర్ల రామారావుగారు ఇక్కడనే చిత్రకళా సుందరిని ఆరాధించిరి, ఆంధ్రదేశ ఐతిహాసిక పరిశోధక మండలికి ఇదియే ఉనికిపట్టు. మద్రాసు ప్రభుత్వ తెలుగు ఆస్థాన కవీశ్వరులు, మహాభారత గ్రంథకర్తలగు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రుల వారి నివాసస్థలము రాజమండ్రి. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారికి, వడ్డాది సుబ్బారాయుడుగారికి న్యాపతి సుబ్బారావు పంతులుగారికి కూడ రాజమహేంద్రవరమే కాపురమైనది. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు ఇక్కడనే నివసించిరి. చిలుకూరి వీరభద్రరావుగారి రచన లిక్కడనే జరిగినవి. గిడుగు రామమూర్తి పంతులుగారు రాజమహేంద్రవరములోనే కొంతకాలము కాపురము చేసిరి. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారికి రాజమండ్రి ప్రాంతమే స్వస్థలము. రాజమహేంద్రవరమునకు దగ్గరగానున్న కాకినాడ, పిఠాపురము పట్టణాలు కూడ ఆంధ్ర సంస్కృతికి కేంద్రములై ఒప్పినవి. ఆ రోజులలో ఒక విధముగా రాజమహేంద్రవరము, కాకినాడ పోటీ పడినవని చెప్పిన అతిశయోక్తి కాబోలదు. కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తుకు ప్రధాన కార్యస్థానమై

యుండెను. పిఠాపురము ఉద్దండ పండితులకు, విద్వత్కవీశ్వరులకు ఆటపట్టు. పిఠాపురము రాజాగారు ఆంధ్ర సారస్వత వికాసమునకు చేసిన పోషణ మిక్కిలి గొప్పది. ఆంధ్ర సాహిత్య పరిషత్తుకు వారే పెట్టనికోట. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారిని వారు విశేషముగా ఆదరించిరి. ఆంధ్ర నాటక రచనలో అద్వితీయమైన ప్రతిభను చూపించి తెలుగు వచన రచనలో అనమానులుగా కీర్తిగాంచిన పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారికి పిఠాపురం రాజాగారే ముఖ్యపోషకులై యుండిరి. బళ్లారినగరము ఆంధ్ర సంస్కృతి వికాసమునకు మరొక ముఖ్య కేంద్రముగా నుండెను. ఆంధ్ర నాటక రచనకు పుట్టినిల్లు బళ్లారి నగరము. నాటక రచనకు, నాటక ప్రదర్శనములకు ఈ బళ్లారియే పూర్వపర్వి. స్వయముగా నాటకములలో అభినయించిన బహునాటక రచయితలు ఆంధ్ర నాటక పితామహులైన ధర్మవరము కృష్ణమాచార్యులవారికి బళ్లారియే కాపురమైనది. కోలాచలము శ్రీనివాసరావుగారికి బళ్లారియే కార్యరంగమైనది. తాడిపత్రి రాఘవాచార్యుల వారికి బళ్లారియే నివాస స్థానమై యొప్పినది. ఈ ముగ్గురు మహనీయులు బళ్లారిలో వెలిగించిన దీపము సకలాంధ్ర దేశమును ప్రకాశవంతము గావించినది. నెల్లూరు నెరజాణలకే కాక ఉద్దండ పండితులకును నివాస స్థానమైనది. బంకు కళంకు లేని కవిచంద్రులు, తోషిత కోవిదేంద్రులు, బహుభాషా ప్రవీణులు నైన వేదం వెంకటరాయ శాస్త్రులవారు నెల్లూరు నుండియే తెలుగు తల్లికి మేలి సొమ్ముల నర్పించిరి. ఆముక్తమాల్యద, నైషధ గ్రంథాల వ్యాఖ్యలతో బాటు ప్రతాపరుద్రీయమను ఉత్తమ నాటకము రచించి, నాటక ప్రదర్శనమునకు ప్రోత్సహించి వెంకటరాయ శాస్త్రులవారు నెల్లూరునుండి సారస్వత జ్యోతిని ప్రకాశింపజేసి తెలుగు దేశమును కాంతివంతము గావించిరి. పూండ్ల రామకృష్ణయ్యగారు అముద్రిత గ్రంథ చింతామణి నెల్లూరులో స్థాపించి సుమారు యిరువది సంవత్సరాలు నడిపి ప్రశస్తమైన సారస్వత సేవ జేసిరి. విజయనగరము సాహిత్యము మరియు కళల పోషణకు పేరుపొంది నిజానికి విద్యానగరమై విలసిల్లెను. మహామహోపాధ్యాయ

తాతా సుబ్బరాయ శాస్త్రుల వారివంటి మహాపండితులకు ఈ విజయనగరమే కాపురమైనది. ద్వారం వెంకటస్వామి నాయుడువంటి సంగీత విద్వాంసులకు ఈ విజయనగరము ఆశ్రయము నిచ్చినది. గురజాడ అప్పారావుగారి వ్యావహారిక భాషోద్యమమునకు విజయనగరము ఉనికి పట్టైనది. విజయనగర సంస్థానాధీశ్వరులైన ఆనంద గజపతి మహారాజు గారు స్వయముగా పండితులై, కళోపాసకులై, రసికులై, వదాన్యులై, ప్రాచీన విజ్ఞానమును మన సాహిత్యమును, కళలను పోషించి సాంస్కృతిక పునరుజ్జీవనమునకు అనుకూలమైన వాతావరణము కలిగించిరి. గుంటూరు పట్టణము దేశభక్త వేంకటప్పయ్య, పూజ్యశ్రీ ఉన్నవ లక్ష్మినారాయణ పంతులుగార్ల నివాసస్థానమై ఆంధ్ర సంస్కృతి వికాసమునకు ఆటపట్టైనది. సాహితీ సమితివంటి సంస్థలు బయలుదేరి తెలుగు భాషలో కొత్త పోకడలను తీసుకొని వచ్చినవి. అభినవాంధ్ర కవి పండితులకు గుంటూరు, తెనాలి నగరాలు కేంద్రములైనవి. శివశంకరస్వాముల వారు తమ పీఠమును యీ ప్రాంతముననే నెలకొల్పినారు. బందరులో డాక్టర్ పట్టాభి సీతారామయ్య, కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు గారలు త్రిమూర్తులవలె శోభించి ఆంధ్రదేశములో సంస్కృతి వికాసమునకు దోహదము గావించిరి. కృష్ణారావుగారి కృష్ణాపత్రిక ఆంధ్రదేశమందలి పల్లెపల్లెకు వెళ్ళి, అసంఖ్యాకులను ఉత్తేజితులను గావించినది. అనేకులకురాజకీయ శిక్షణనిచ్చి, సంస్కృత్యభి రుచులను అలవడ జేసినదీ పత్రిక. నిజానికి ఆంధ్రదేశములో కృష్ణాపత్రిక సాంప్రదాయమొకటి బయలు దేరినదని చెప్పిన అతిశయోక్తి కాజాలదు. అఖిలాంధ్ర కవులకు, కళాకారులకు, చాలమందికి భావనాగురువైనదీ పత్రిక. ఇంతకు ముందే చెళ్లపిళ్ళ వెంకట శాస్త్రులవారు కొంతకాలము బందరులో నివసించి, యువకులనేకులలో కొత్త జీవము పోసి, బందరు ప్రాశస్త్యమును యినుమడింపజేసిరి. అభినవాంధ్ర కవి పండితులనేకులు బందరులో వెంకట శాస్త్రుల గారివద్ద శుశ్రూష గావించి తమ భవిష్యత్ సాహితీ జీవనవల్లి

కలకు పాదులను గల్పించుకొనిరి. మద్రాసు పట్టణముగూర్చి వేరుగా చెప్పవలసిన అవసరము లేదు. మద్రాసులో నాగేశ్వరరావుగారి ప్రవేశము ఆంధ్ర సంస్కృతి చరిత్రలో ఒక చరితాత్మకమైన ఘట్టము. వారి ఆంధ్రపత్రిక మద్రాసు నగరమునుండి వెలువడి మొత్తము తెలుగు దేశములో చీకటిని తొలగించి, వెలుతురును వ్యాపింపచేసినది. ఆంధ్రపత్రిక సారస్వతాను బంధములు, సంవత్సరాది సంచికలు, భారతి తెలుగు దేశమునకు చేసిన సేవ అమోఘమైనది. ఆంధ్ర కవి పండితులు ఆంధ్ర నాయకులు కొందరు మద్రాసు నగరమునకు వచ్చి కొంతకాలము నివసించి తెలుగు వెలుగును ప్రసరింపచేసిరి. వీరేశలింగం పంతులుగారు కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు, వేదం వెంకటరాయశాస్త్రులవారు; కొమర్రాజు లక్ష్మణరావుగారు, వావిలి కొలను సుబ్బారావుగారు మున్నగువారు మద్రాసు నగరముతో సంబంధము కల్పించుకొనిరి. సుమారు నూరు సంవత్సరముల క్రిందట మద్రాసులో ఉండిన ఏనుగుల వీరాస్వామయ్య, పరవస్తు శ్రీనివాసాచార్యులు, పరవస్తు చిన్నయ సూరి మొదలైన పండిత ప్రకాండులను, తరువాత ప్రసిద్ధి కెక్కిన బహుజనపల్లి సీతారామాచార్యులు, తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్య, బరూరు త్యాగరాయశాస్త్రులు మున్నగు విద్వాంసులును ఆంధ్ర భాషా వ్యాప్తికి ఉదాత్తమైన కృషిచేసిరి. ఆకాలములో మదరాసు నగరము ఆంధ్ర సంస్కృతికి కేంద్రమై యుండినది. ఎనుబది సంవత్సరములకు ముందు నుండియే తెలుగు ముద్రాయంత్రములు మద్రాసులో నెలకొని అపూర్వమైన సేవను చేసినవి. తరువాత వావిళ్ళ రామస్వామిశాస్త్రులవారు మద్రాసులోనే తమ గ్రంథ ప్రచురణలను ప్రారంభించిరి. వావిళ్ళవారి తరువాత తెనుగు ప్రకాశకులలో ఎన్నదగిన వారైన వేమూరి వెంకట కృష్ణమశెట్టిగారి ఆనంద ముద్రాక్షరశాల మద్రాసులోనే స్థాపితమైనది. విశాఖపట్టణమున ఆంధ్ర విశ్వకళా పరిషత్తు స్థాపన జరిగెను. మారేపల్లి రామచంద్రకవిగారు తరువాత శ్రీరంగం శ్రీనివాసరావుగారు విశాఖపట్టణ

మున నివసించి కవితా సమితి పేరుతో సాంస్కృతిక కార్యకలాపాలకు దోహదము గావించిరి. జయపురం మహారాజా వారైన విక్రమదేవ వర్మ గారు స్వయముగా పండితులు, భాషాపోషకులు. ఆంధ్ర ఉత్కళ విశ్వ విద్యాలయాలకు వీరు భూరి విరాళాలిచ్చి అనేక కవి పండితులను ఆద రించిరి. ఈ కాలమున జమీందారులలో కవులైనవారును ఉండిరి. వారిలో మంత్రిప్రగడ భుజంగరావుగారిని పేర్కొనవలసి యున్నది. బొబ్బిలి, వెంకటగిరి సంస్థానాధీశ్వరులు ఈ కాలము నందలి భాషా పోష కులలో పేర్కొనదగినవారు. రాయలసీమ యందు, కడపలో జనమంచి శేషాద్రిశర్మగారు, అనంతపురములో డాక్టర్ చిలుకూరి నారాయణరావు గారు, ఒంటిమిట్టలో వావిలికొలను సుబ్బారావుగారు సాహితీ దీపము లను వెలిగించిరి. ఇటీవల ఆంధ్రదేశములో అన్ని కార్యక్రమాలవలెనే సాంస్కృతిక వికాసమునకు కూడ విజయవాడ ముఖ్య కేంద్రమైనది. ఈనాడు విజయవాడ ఆంధ్రదేశము యొక్క హృదయముగా నున్నది. ఈ పట్టణాలతో బాటు, ఈ సందర్భమున వనపర్తి, గద్వాల పట్టణాలను గూడ స్మరించవలసి యున్నది. ఆ రోజులలో వనపర్తి, గద్వాల సంస్థా నాల సన్మానాలు కవి పండితులకు, కళాకారులకు గొప్ప గౌరవముగా నుండెను. ఈ పట్టణాలు తెలుగు భాషను, ఆంధ్ర సంస్కృతిని పోషించి నవి. దోమకొండ, జటప్రోలు సంస్థానములు కూడ ఆంధ్ర సంస్కృతీ వికాసమునకు తమ వంతును చెల్లించి కీర్తి గాంచినవి.

ఈ విధముగా ఆంధ్రదేశములోని ముఖ్య పట్టణాలలో ఆంధ్ర సంస్కృతీ వికాస కార్యక్రమములు ప్రారంభమై తెలుగు దేశమున నవ యుగోదయము గావించినవి.

సలక్షణముగా భాషను అధ్యయనము గావించుటవలన భాషలో మంచి అభిరుచి కలిగి అందువలన సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమము చక్కగా వ్యాప్తినొందుటకు అవకాశము కలుగును. మన దేశమును ఆ కాలమున పాలించినది ఆంగ్లేయులు. తమమతమైన క్రైస్తవ మత

మును, తమ భాషయైన ఆంగ్లభాషను ఇక్కడ ప్రచారము గావించుట వలన తమ పరిపాలనను స్థిరముగా నిలువగలదని ఊహించిరి. దైనందిన పరిపాలన వ్యవహారాలలో వారికి ప్రజల భాషతో కొంత పరిచయము కలిగించుకొనుట అవసరమైనది. ఈ రెండు ఉద్దేశాలతో వారు తెలుగు భాషను నేర్చుకొనుట ప్రారంభించిరి. కావున క్రైస్తవ మిషనరీలు మరియు ఇంగ్లీషు పరిపాలకులైన సివిలియన్ అధికారుల వలన ఈ కాలమున తెలుగు భాష సక్రమముగా నేర్చుకొను క్రొత్త పద్ధతి ప్రారంభమైనది. విదేశీయులు తెలుగు భాషను నేర్చుకొన్నప్పుడు వ్యాకరణము, భాషాంతరీకరణము అను రెండు పద్ధతులు ముఖ్యమైన సాధనాలు. అందుచేతనే తెలుగు భాషలో క్రైస్తవ మిషనరీలు మరియు ఇంగ్లీషు సివిలియను అధికారుల ప్రాపకముచే వచ్చిన పుస్తకాలలో నిఘంటువులు, వ్యాకరణాలు ముఖ్యమైనవిగా నున్నవి. క్రైస్తవ మిషనరీలు తాము చేయు ప్రతి పని వలెనే ఈ పనిని గూడ శ్రద్ధతో నిర్వహించిరి. ఈ విధముగా క్రైస్తవ మిషనరీల ప్రోత్సాహము చేతనే శ్రీ సీతారామాచార్యుల వారి శబ్ద రత్నాకరము బయలుకు వచ్చినది. తరువాత నిఘంటువు లెల్ల దీని ఛాయలే.

ఆకాలమున మద్రాసు రాజధాని నగరమై సకల కార్యక్రమాలకు ప్రధాన కేంద్రముగా నుండెను. క్రైస్తవ మిషనరీలు, అధికారులు జిల్లాలలో తిరిగి కొంత పని చేసినప్పటికిని, దానికి కార్యస్వరూపము మద్రాసు నగరములోనే యీయబడినది. దేశ భాషలలో పుస్తకాలు అచ్చువేయుట కొరకై మొట్టమొదటి ముద్రణాలయము యస్.పి.సి.కె. ప్రెస్ 1761 లో స్థాపితమైనది. ఈ ముద్రణాలయాధికారులు క్రైస్తవ మిషనరీలు నిర్వహించు చుండిన వాఙ్మయ కార్యక్రమాలకు మంచి దోహదము గావించిరి. మొట్టమొదటి రోజులలో వారు ఎక్కువగా తమిళము వైపే శ్రద్ధ చూపించిరి. అప్పుడు తెలుగులో అభిరుచి కలిగిన విదేశీయుడు ఎఫ్. డబ్ల్యూ. ఎలిస్. కాని ఆయనకు తెలుగు ప్రధానము కాదు. తమిళము, మళయాళముతోపాటు ఆయన దృష్టిలో తెలుగు కూడ ఒక దేశభాష. 1812వ

సంవత్సరము ఫోర్టు సెంట్ జార్జ్ కళాశాల స్థాపన జరిగినది. ఈ కళాశాల కనుబంధముగా ఒక ముద్రణాలయము, ఒక పుస్తక విక్రయశాల, ఒక గ్రంథాలయము స్థాపించబడుట గమనించదగిన విశేషము. వీని పర్యవేక్షణకొరకై ఒక బోర్డుకూడ నియమింపబడినది. 1820 వ సంవత్సరమువరకు ఈ కళాశాల, పుస్తకముద్రణాలయము, పుస్తక విక్రయశాల, గ్రంథాలయములు చక్కగా బలపడినవి. ఈ బోర్డులో ఎఫ్.డబ్ల్యు. ఎల్లిస్, ఎ.డి. క్యాంప్‌బెల్‌వంటి పండితులుండిరి. ఇంగ్లీషు సివిలియనులకు ప్రాంతీయ భాషలలో శిక్షణ నిచ్చుట ఈ కళాశాల యొక్క ముఖ్యోద్దేశము. అయినప్పటికిని దక్షిణ దేశభాషలలోని వ్యాకరణ విజ్ఞానము సంపాదించి వాని ఉత్పత్తి మరియు పరస్పర సంబంధములను గూర్చి తెలుసుకొనుట గూడ ఈ కళాశాల తన ఆదర్శముగా పెట్టుకొనెను. తెలుగు భాషా వికాసమునకు ఈ బోర్డు చేసిన సేవ మిక్కిలి గొప్పది. మచిలీపట్టణ వాస్తవ్యుడైన మామిడి వెంకయ్యాగారి "ఆంధ్ర దీపిక" అను తెలుగు నిఘంటువు మీది హక్కులను ఈ బోర్డువారే వేయిపగోడాలకు కొనిరి. తరువాత తెలుగు వ్యాకరణము జంటు అను పేరుతో ఎ.డి. క్యాంప్‌బెల్ వ్రాసినది ఈ కళాశాల ముద్రణాలయములోనే అచ్చువేయబడెను. ఈ వ్యాకరణ రచనలో క్యాంప్‌బెల్‌గారికి ఎఫ్.డబ్ల్యు. ఎల్లిస్ మరియు కళాశాలలోని ఇంగ్లీషు బోధకులైన ఉదయగిరి వెంకటరామయ్య, తెలుగు, సంస్కృత బోధకులైన పట్టాభిరామశాస్త్రులగార్లు సహాయము గావించిరి. తరువాత వారు మెకంజీగారు వ్రాసిన వ్రాతప్రతులను సంపాదించిరి. ఈ కాలమున ఒక మంచి సమగ్రమైన శబ్దకోశము యొక్క అవశ్యకతను వారుగుర్తించి, ఇందుకొరకై క్యాంప్‌బెల్‌గారిని నియోగించి, ఇద్దరు సహాయకులతో వారిని బళ్లారిలో నుండ నియమించిరి. 1819 వ సంవత్సరమున కళాశాలలోని బోధకులైన కె. గురుమూర్తిగారు వ్రాసిన విక్రమార్క కథలు అచ్చువేయుటకు ప్రభుత్వము అజ్ఞాపించెను. ఇదే సంవత్సరమున క్యాంప్‌బెల్ వ్యాకరణము యొక్క ద్వితీయ ముద్రణ జరిగినది. 1827వ సంవత్సరమున సి.పి. బ్రౌన్‌గారు తెలుగు ఛందస్సును గూర్చి

వ్రాసిన గ్రంథము ఈ కళాశాల వారు వేయిపగోడాలకు కొనిరి. 1835 సంవత్సరములో మారిస్ అను వారు కె. గురుమూర్తిగారి సహాయముతో ఇంగ్లీషు తెలుగు నిఘంటువును వ్రాసిరి. దీనిని కళాశాల బోర్డు అచ్చు వేసెను. ఈ కాలమున టి.సి. మారిస్ ఆయన సోదరుడు హెచ్. మారిస్ మరియు సి.పి. బ్రౌన్ గారలు తెలుగు భాషాభివృద్ధికై చేసిన కృషి మిక్కిలి గొప్పది. బ్రౌన్‌గారు సర్వతోముఖ పాండిత్యము కలిగిన రచయిత. వ్యాకరణము, ఛందస్సులను గూర్చిన గ్రంథాలు కాక, వేమన పద్యాలను ఈయన ఇంగ్లీషులో భాషాంతరీకరించిరి. ఇంగ్లీషు శబ్దాలకు తెలుగు వివరణము వ్రాసిన బి. సుబ్బరాయలుగారి గ్రంథము ఈ కాల మందలి ముఖ్యమైన పుస్తకము. అప్పటి తెలుగు భాషాస్థితిని గురించి ప్రస్తావించుచు తెలుగుభాష "ఇంచుమించుగా నశించు చుండె" ననియు "అది ఆరిపోవుచు మిణుకు మిణుకు మను దీపము వలె నుండె" ననియు బ్రౌన్‌గారు చెప్పిరి. ఈ మాట ఆనాటి తెలుగు విద్వాంసులకు ఖేదము కలిగించి వారిని నిద్రనుండి లేపినది. ఈ విధముగా 19 వ శతాబ్దము యొక్క మొదటి సగములో తెలుగు భాషాధ్యయనము ప్రాధాన్యము వహించినది కాని నూతన నిర్మాణమునకు అనుకూలమైన ప్రతిభ మాత్రము కనపడలేదు. 1854 లో కంపెనీ వారు ఈ కాలేజీ బోర్డును రద్దు చేసిరి. బోర్డ్ అఫ్ ఎక్సామినర్స్ దీని స్థానములో వచ్చినది. అది సంధి యుగము. అనేక సంస్థలు బయలుదేరి పని చేయసాగినవి. వివిధ ఆదర్శాలతో ముందంజ వేయసాగినవి. వీనికి పరస్పర సమైక్యం కుదురలేదు. ఒకే ఆదర్శముతో పని చేయుటకు సంస్థలు ముందుకు వచ్చినవి. కాని పూర్వపు కళాశాలల కుండిన ఏకీభావము, కేంద్రీకరణ వీనిలో లేనందు వలన చెప్పదగిన గొప్ప పని జరుగలేదు. తరువాత మద్రాసు విశ్వవిద్యాలయ స్థాపన ప్రెసిడెన్సీ వచ్చయప్ప కళాశాల స్థాపన జరిగి పాఠ్యప్రణాళికలలో దక్షిణ దేశభాషలు చేర్చబడినవి. మొదట ఈ భాషలు నిర్బంధ పఠనీయములై నప్పటికిని తరువాత ఈ శతాబ్దాదిలో నామకార్థము నిర్బంధ పఠనీయములుగా చేసి ఐచ్ఛిక విషయాలలో చేర్చబడినవి.

కాని కొంత కాలానికి తిరిగి ఈ భాషలు నిర్బంధ పఠనీయాలై యథాపూర్వ స్థితికి వచ్చినవి. మద్రాసు విశ్వవిద్యాలయ పక్షాన దేశ భాషలలో ముఖ్య ముగా తమిళములో కొంత కృషి చేయబడి తమిళ నిఘంటువు ప్రకటన జరిగినది. ఓరియంటల్ రీసర్చి ఇన్స్టిట్యూట్ వారు మాత్రము తెలుగు భాషకై కృషి గావించిరి. ఈ సంస్థలో ద్రవిడ భాషలకును, సంస్కృత మునకును స్థానముండెను. 1852 లో బ్రౌన్ గారి ఇంగ్లీషు తెలుగు నిఘంటువు ప్రకటన జరిగినది. కాల్డ్వెల్ వ్రాసిన ద్రవిడ భాషా వ్యాక రణము 1861 లో ప్రకటింపబడినది.

తరువాత యీ శతాబ్దమున కాల్డ్వెల్ సిద్ధాంతమునకు అనుకూల ముగా కోరాడ రామకృష్ణయ్యగారు వ్యతిరేకముగా డాక్టర్ చిలుకూరి నారా యణరావుగారు గ్రంథ పరంపరను ప్రకటించిరి. 1650 నుండి 1875 వరకు తెలుగు భాషలో ఉజ్వలమైన సాహిత్యము తక్కువనియే చెప్ప వలెను. శతకాలను, కీర్తనలను విడిచి పెట్టిన ఈ కాలమున ప్రతిభావంత మగు సాహిత్యము మిక్కిలి కొద్ది. ముస్లిం పరిపాలన వలన జరిగిన ఘోరాల నుండి రక్షించవలసినదని ఈ కాలమందలి శతకాలలో కవులు భగవంతుని ప్రార్థించినారు. అందుచేత ఆకాలమున సాహిత్య పోషణ కవకాశాలు చాలా తక్కువగా నుండెనని స్పష్టమగుచున్నది. ప్రాచీన సారస్వత సంస్కృతులపైన అప్పటి పరిపాలకులకు ఆదరము లేకపోవు టయేగాక వాని విధ్వంసమునకై కూడ వారు ప్రయత్నించిరి. దేశములో శాంతి లేకుండెను. యుద్ధాల వలన భద్రత తక్కువగా నుండెను. ఇట్టి దేశ పరిస్థితి సాహిత్య నిర్మాణానికి అనుకూలముగా లేకుండెను. ఈ కాల మున సంస్కృత భాషానువాదాలు కొన్ని జరిగినవి. ప్రబంధాలు శృంగార కావ్యాలు కొన్ని వచ్చినవి. వచనము ధారాళముగా ఉపయో గించుట జరిగినది. కుందుర్తి వెంకటాచల కవి భారత, భాగవత రామా యణాలను తెలుగు వచనములో వ్రాసిరి. తంజావూరు, మధుర, మైసూ రులలో తెనుగు వచన రచన లుద్భవించినవి. త్యాగరాజు, క్షేత్రయ్యలు

ఈ కాలమందలి కీర్తన రచయితలు. ఈ ఇరువురు మన కీర్తన వాఙ్మయాకాశమందలి సూర్యచంద్రులు.

మద్రాస్ సివిల్ సర్వీసులో నుండిన సి.పి. బ్రౌన్ తెలుగులో ఉత్తమ కావ్యాలను సంపాదించి ప్రకటించుట 1826 లో ప్రారంభించిరి. 1836 లో వారు తెలుగు సాహిత్యము గురించి చక్కని వ్యాసము ప్రకటించిరి. ఇది తరువాత కవుల చరిత్రలకు వారి జీవిత వివరాల పరిశోధనల కుపకరించినది. 1845–53 ప్రాంతమున బ్రౌన్ ప్రకటించిన నిఘంటువు ఈ నాటికిని ఉపయుక్తముగా నున్నది.

అధునిక తెలుగు సారస్వత ప్రపంచమున 1880 వ సంవత్సరమున నవయుగోదయము గావించిన గౌరవము నిజానికి వీరేశలింగం పంతులుగారికే చెందుచున్నది. వీరేశలింగంగారు సంఘ సంస్కర్త, బ్రహ్మ మతావలంబకులు. తెలుగులో మొట్టమొదటి నవలను వీరేశలింగం పంతులుగారే వ్రాసిరి. వారి రాజశేఖర చరిత్ర ఇంగ్లీషులోను FORTUNE'S WHEEL By T.R. Hutchinson పరివర్తితమైనది. వారి ఆంధ్రకవుల చరిత్ర తెలుగు సాహిత్య చరిత్రలో మొట్టమొదటిది. వీరేశలింగంగారు వ్యాసకర్త. నాటక రచయిత. ఇంచుమించుగా తెలుగు భాషలోని క్రొత్తతీరు రచనలన్నింటికిని వారే ప్రారంభకులని చెప్పవచ్చును. తెలుగు వచనానికి సారళ్యము సమకూర్చినవారు శ్రీ వీరేశ లింగంగారు. తమ స్వీయ చరిత్రలో పంతులుగారు తెలుగుభాషలో తాము ప్రవేశ పెట్టిన కొత్తదారులను గూర్చి ఈ విధముగా వ్రాసిరి. "తెలుగులో మొదటి వచన ప్రబంధమును నేనే చేసితిని. మొదటి నాటకమును నేనే తెనిగించితిని. మొదటి ప్రకృతి శాస్త్రమును నేనే రచించితిని. మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని. మొదటి చరిత్రమును నేనే రచించితిని. స్త్రీలకై మొదటి పుస్తకమును నేనే కావించితిని". అనాడు వాఙ్మయ రంగమున వీరేశ లింగంగారి ప్రబల ప్రత్యర్థులలో ముఖ్యులు కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు, కాశీ

భట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు, ఈ ఇరువురు వ్యావహారిక భాషకు సంఘ సంస్కరణకు తీవ్ర వ్యతిరేకులు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, వీరేశలింగంగారి ముఖ్య శిష్యులు. వీరు చక్కని వచనములో అద్భుత హాస్యములతోను మంచి నవలలు వ్రాసిరి. వీరి నవలలలోని, నాటకాల లోని శైలి బహుసుందరమైనది. తెలుగు వచనానికి వీరు సొంపును గూర్చిరి. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు అనేక నాటకాలతో, సాక్షి ఉపన్యాసాలతో సాహిత్య రంగమున ముందుకు వచ్చిరి. ఈ కాలమున ఇతర భాషల నుండి అందు ముఖ్యముగా వంగభాష నుండి పరివర్తన ములు చాల జరిగినవి. ద్విజేంద్ర లాల్‌రాయ్ నాటకాలు, బంకిం చంద్రుని నవలలు తెలుగు భాషలోనికి వచ్చినవి. ఆంధ్ర ప్రచారిణీ, సరస్వతీ గ్రంథ మండలులు యీ నవలా ప్రకటనములో ముందంజ వేసినవి. తరువాత రవీంద్ర, శరచ్చంద్రుల రచనలు గూడ తెలుగు లోనికి భాషాంతరీకరించబడినవి. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు రమేశ చంద్రదత్తుగారి నవలను, సుధా శరచ్చంద్రముఅను పేరుతో తెని గించిరి. రమేశ చంద్రదత్తు వ్రాసిన The Slave Girl of Agra అను నవల దాసీకన్య అనుపేరుతో అనువదింపబడినది. ఈ విధముగా వంగ వాఙ్మయము విశేషముగా తెలుగులోనికి వచ్చినది. ఇంగ్లీషుభాష యొక్క ప్రభావము ఈ కాలమున తెలుగు భాషపై ఎక్కువగా పడినది. స్వయముగా వీరేశలింగం పంతులుగారు ఇంగ్లీషు భాషవలె తెలుగు భాష వివిధ వాఙ్మయ వీధులలో అభివృద్ధి చెందవలెనని అభిప్రాయపడి తెలుగు భాషను సంపన్నము గావించుటకై కృషిచేసిరి. ఆంగ్ల భాషా పద్ధతిని ఈ కాలమున నాటక రచన జరిగినది. అంకములలో రంగ విభజన పాత్రపోషణా విధానము, విషాదాంత పద్ధతి, ఆంగ్ల భాషా ప్రభావము వలననే ప్రవేశ పెట్టబడినవి. తెనుగు నవల, కథానిక, ఏకాంకిక, వ్యాస రచనలపైన ఆంగ్ల భాషా ప్రభావము స్పష్టముగా కనపడుచున్నది. ఆధు నిక కవిత్వము మీద ఆంగ్ల భాషాముద్ర ప్రస్ఫుటముగా గోచరించు చున్నది. ఆంగ్ల విమర్శన పద్ధతులు ఈనాటి తెలుగు విమర్శనమునకు

ఒతవడియైనవి. ఇంగ్లీషు భాషాపదములు తెలుగు భాషలోనికి వందల కొలది ప్రవేశించినవి. ఇంగ్లీషులో ఆలోచించి తెలుగులో వ్రాయవలసి నంతవరకు ఆంగ్లభాషా ప్రభావము తెలుగు దేశముమీద పడినదని చెప్ప వచ్చును. ఇంగ్లీషులో రాజకీయ, అర్థిక శాస్త్రాలు, విజ్ఞాన శాస్త్రాలను అభ్యసించిన ఆంగ్ల విద్యాధికులు, తెలుగులో అట్టి రచనలు గావించు టకు ప్రారంభించిరి. ఇంగ్లీషు భాషా ప్రభావము గూడ కొంత ఈ నాటి సాహిత్యము మీద కనపడుచున్నది. మున్షి ప్రేంచంద్ కథలను కృష్ణా పత్రిక ద్వారా తెలుగు పాఠకులకు మాడపాటి హనుమంతరావుగారు పరి చయము గావించిరి. ఈ కథల ప్రభావము కూడ తెలుగు కథానికా సాహిత్యము మీద కనపడుచున్నది. ఒకరిద్దరు కవులు ఉమర్ ఖయామ్ రచనలను తెలుగులోనికి అనువదించిరి. అయినను పార్సీ ప్రభావము ఈ కాలమున ఎక్కువగా తెలుగు సాహిత్యము మీద కనపడదు. తెగులు భాషపైన మొదటి నుండి యున్న సంస్కృత భాషా ప్రభావము ఈ కాల మున కూడ కనబడుచున్నది. ఈనాటి కవి పండితులందరు సంస్కృత భాషలో మంచి ప్రవేశము కలవారై శాకుంతల, ఉత్తర రామచరిత్ర, వేణీ సంహారాది నాటకాలను పండితులు ఆంధ్రీకరించిరి. తెలుగుభాషలో ఒకటి రెండు మహారాష్ట్ర గ్రంథాలు కూడ పరివర్తితములైనవి. కాని మహారాష్ట్ర భాషయొక్క ప్రభావము తెలుగు మీద మిక్కిలి కొద్ది. ఈ కాలమున మహారాష్ట్ర భాషతో పరిచయముగల తెలుగు పండితులలో చెప్పదగినవారు కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారొక్కరే. ఈనాటి వాఙ్మయము నందు పైన పేర్కొనబడిన భాషల యొక్క ప్రభావ సంబం ధములతోపాటు, సమకాలిక భావాలు, సమకాలిక జీవన చిత్రణము, సమకాలిక సమాజ పద్ధతుల ప్రతిబింబములు కనపడుచున్నవి. ఈ విధ ముగా ఆధునిక వాఙ్మయము నందు ప్రాచీన సాహిత్యముపై గాఢమైన అభిమానము ఒకవంక, సాంప్రదాయమునకు భిన్నము కాని నూతన మార్గాన్వేషణ మరొకవంక, సాంప్రదాయమును ధిక్కరించి చేసిన

తిరుగుబాటు ఇంకొక వంక, క్రొత్త పాతల మేలి కలయిక వేరొకవంక కనబడుచున్నవి.

ఈ కాలమున తెలుగు సరస్వతి వివిధ వాఙ్మయ వీధులలో విహరించినది. నవలలలో ఉన్నవ లక్ష్మీనారాయణగారి "మాలపల్లి" విశ్వనాథ సత్యనారాయణ, అడివి బాపిరాజుగార్ల నవలలు ప్రాధాన్యము వహించుచున్నవి. "చిన్నకథ" పాఠకులను అన్నిటికన్న ఎక్కువగా ఆకర్షించినది. పండిత ప్రకాండులైన వేలూరి శివరామశాస్త్రి గారితోపాటు, చింతా దీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు, గుడిపాటి వెంకటచలం, కరుణకుమార్, కొడవటిగంటి కుటుంబరావు, పాలగుమ్మి పద్మరాజుగారలు తెలుగు కథను చక్కగా దిద్ది తీర్చిరి. మాసపత్రికలలో వారపత్రికలలో చిన్నకథలు ముఖ్య ఆకర్షణలైనవి. వ్యాసరంగమున పానుగంటి వారి సాక్షితో పోటీకి అనంతపురము నుండి వదరుబోతు బయలుదేరినది. అముద్రిత గ్రంథ చింతామణి, శారద, భారతి ఈ కాలమందలి ముఖ్య సాహిత్య పత్రికలు. తరువాత సాహితీ, జయంతి, ఉదయినీ, ప్రతిభ ఇంగ్లీషులో కోలవెన్ను రామకోటేశ్వరరావుగారి "త్రివేణి" ఆధునిక ఆంధ్ర భాషా వికాసమునకు చక్కగా తోడ్పడినవి. తెలుగులో ఆధునిక విమర్శకు కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు ఆదర్శము చూపించిరి. 1899 లో రామలింగారెడ్డిగారు కవిత్వతత్త్వ విచారము ప్రకటించి తెలుగు విమర్శా పద్ధతులలో క్రొత్త దారిని చూపెంచిరి. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, రామలింగారెడ్డిగారి సారస్వత బంధువులైరి. పాత ప్రబంధాల, పురాణాల ప్రాధాన్యము తగ్గి క్రొత్త విలువలతో, క్రొత్తఅభిప్రాయాలతో, ఆధునిక కవిత్వము ఆవిర్భవించినది. గురజాడ అప్పారావుగారి వ్యావహారికభాష ముత్యాలసరాలు వాఙ్మయరంగములో సంచలనము తీసుకొని వచ్చినవి. వానిపైన గిడుగు రామమూర్తి పంతులుగారు ఆంధ్ర పండితుల ఆక్షేపణలకు సరియైన సమాధానాలిచ్చి వారిని నిరుత్తరులను గావించి వ్యావహారిక భాషకు పెట్టనికోటగా నిలిచిరి. రాయప్రోలు సుబ్బారావుగారు భారత జాతీ

యతకు, ఆంధ్రదేశ[?]చరిత్రకు తెనుగుదనమునకు తమ కవిత్వములో ప్రాధాన్యము నిచ్చి "జడకుచ్చులు" "తృణకంకణా"ది సవ్యకావ్యాలను ప్రకటించి ఆధునిక ఆంధ్ర కవులకు మార్గదర్శకులైరి. కృష్ణశాస్త్రి, వేదుల, దువ్వూరు, అడవి, విశ్వనాథ, నాయనినండూరి, జాషువ, పింగళి, కాటూరి, శివశంకరశాస్త్రి ప్రభృతులు తమతమ రచనలతో, ఖండకావ్యాలతో, గేయాలతో తెలుగు సాహిత్య వనవాటికలో క్రొత్తపాదులను కల్పించిరి. తరువాత శ్రీ శ్రీ విప్లవధ్వజమెత్తి ఒక ప్రత్యేక పథము తెలుగు సాహిత్యములో నెలకొల్పిరి. రాజశేఖర శతావధానిగారి ప్రతాప సింహచరిత్ర, గడియారం వెంకట శేషశాస్త్రిగారి శివభారతము, తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి ఆత్మకథ, పింగళి కాటూరుల సౌందరనందము, ఇటీవల ప్రకటితమైన మధునాపంతుల వారి ఆంధ్ర పురాణము ఈనాటి తెలుగు సాహిత్యమునకు వన్నెబెట్టు నిండు కావ్యములు. నాటక రచనా రంగములో ధర్మవరం కృష్ణమాచార్యులవారు విషాదాంత నాటక పద్ధతిని ప్రవేశ పెట్టిరి. కోలాచలమువారు చారిత్రాత్మక నాటకాలు వ్రాసిరి. చిలకమర్తి వారి నాటకాలు వానిలోని పద్యాలు ఆంధ్రదేశములోని అబాలగోపాలమును ఆకర్షించినవి. కన్యాశుల్కములో గురజాడ అప్పారావుగారు సంఘ సంస్కరణ, వ్యావహారిక భాషా ప్రచారములతోపాటు నాటి తెలుగు దేశముయొక్క సాంఘిక జీవనమును చక్కగా చిత్రించిరి. హాస్యము, మనస్తత్వ పరిశీలన, పాత్రపోషణ పానుగంటి నాటకాలలో ముప్పిరిగొని యున్నవి. వెంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయము ఈనాటి నాటకాలలో సాటిలేని జాతిరత్నము. శ్రీపాద వారి "బొబ్బిలి" పాత పద్ధతిలో రచించిన మంచి నాటకము. ఈ కాలమున బహు ప్రచారము నొందిన నాటకాలలో తిరుపతి వెంకట కవుల "పాండవోద్యోగ విజయాల"ను ప్రత్యేకముగా పేర్కొనవలసి యున్నది. క్రమక్రమముగా వచన నాటకాలు కూడ మన దేశములో వర్ధిల్ల సాగినవి. ఏకాంకికలు ప్రారంభమైనవి. చిలుకూరి నారాయణరావు, రాజమన్నారు మొదలైన వారు ఏకాంకికా రచనలో ప్రతిభను చూపిం

చిరి. తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారి గేయ నాటికలు ప్రత్యేక విశిష్టత నందినవి. ఆచార్య ఆత్రేయ నాటకాలు తెలుగు దేశమున ప్రసిద్ధి వహించినవి. ఈ కాలపు సాహిత్యమునకు ఆచార్య శ్రీ కురుగంటి సీతారామయ్యగారు చక్కని చరిత్రను రచించిరి.

ఈ శతాబ్దమున కూచిపూడివారి సాంప్రదాయానికి, వెంపటి వేంకట నారాయణ, చింతా వెంకట్రామయ్య, వేదాంతం లక్ష్మీనారాయణగార్లు ఆచార్యత్వమును వహించిరి. నాటకాలు యీ కాలమున వేసినవారిలో చాలామంది వీరి శిష్యపరంపరలోనివారే. 1880 వరకు తెలుగు దేశమున యక్షగానాలు, పగటివేషాలు, తోలుబొమ్మలాటలు మొదలైన వినోదములు మాత్రమే ప్రచారములో నుండెను. 1880లో ధార్వాడ కంపెనీ వారు తెలుగుదేశము వచ్చి తాటాకు పందిళ్ళలో నాటక ప్రదర్శనాలు నిర్వహించిరి. ఇదిచూచిబెజవాడ,బందరు,గుంటూరు మొదలైన పట్టణాలలోనాటక సమాజాలు స్థాపితమైనవి. మన ప్రథమ నాటకాలు చాలామట్టుకు మొదలు వచనములోనే కూర్చబడి, తరువాత వానిలో అక్కడక్కడ కొన్ని పద్యాలూ పాటలు చేర్చబడుచుండెను. ఈ నాటక సమాజాలకు శిక్షణ యిచ్చు ఉపాధ్యాయులుండెడివారు. మొట్టమొదలు తెల్లగుడ్డనే తెరగా ఉపయోగించు చుండెడివారు. మద్దెల, సితారు, ఫిడేలు మనవారికి నాటకాలలో ఉపయుక్తములైన వాద్యములు. పందిళ్ళలో ఆడిన యీ నాటకాలలో ఆంగికాభినయానికి ఎక్కువ ప్రాధాన్యము ఉండెను. నటకులు పౌడరు వేసుకొనెడివారు. విగ్గు లుపయోగించెడివారు. సరస్వతి విఘ్నేశ్వరుల వేషాలతో ప్రారంభమై తరువాత నటీ సూత్రధారులు వచ్చి పిమ్మట నాటకము మొదలయ్యేడిది. 1884 వ సంవత్సరములో తెలుగు దేశానికి పార్సీ కంపెనీ వచ్చి హిందీలో నాటకాలు ఆడి, కేవలము చేతులు త్రిప్పటమే అభినయము కాదని, ముఖ భావాల వలన రసమును ఒప్పించవలెనని యీ పార్సీకంపెని తెలుగు నాటక సమాజాలకు తెలిపినది. ఈ కాలములో బందరులో ఈమని లక్ష్మణస్వామిగారు తెలుగు హిందీ నాటకాలను ఆడి యానవ్వారతములో కీర్తిని గాంచిరి. బహునాటక రచయితలైన

ధర్మవరము కృష్ణమాచార్యులవారు బళ్ళారి, రాయలసీమలలో నాటక సమాజము స్థాపించి నాటకాలు వేయించి స్వయముగా అభినయించెడివారు. హరిప్రసాదరావుగారు బళ్ళారి నాటకాలను సర్కారు జిల్లాలలో ప్రచారము గావించిరి. కందుకూరి, చిలకమర్తి, వడ్డాది కవులు గ్రాంథిక భాషలో పురాణాలను నాటకములుగా రచించిరి. పానుగంటివారు పురాణకథలతో పాటు సాంఘిక కథలను గూడ తీసుకొని శృంగార హాస్యరస ప్రధానములైన నాటకాలను వ్రాసిరి. ఈ కాలమున ఆంధ్ర నాయకులైన దేశోద్ధారక నాగేశ్వరరావు, కొండా వెంకటప్పయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, టంగుటూరి ప్రకాశం పంతులు నాటకాలలో వేషాలు వేసిరి. ఇటువంటి పరిస్థితులలో కన్యాశుల్క నాటక రచన జరిగినది. ధార్వాడా పార్సీ కంపెనీల ప్రదర్శనాలు చూచిన తరువాత తెలుగుదేశమున నాటకశాలల నిర్మాణమును గూర్చిన శ్రద్ధ అతిశయించినది. నాటకాల ద్వారా ధనము సంపాదింప వలెనని ఆకాంక్ష కలిగినది. 1900, నుండి 1910వ సంవత్సరము వరకు అనేక సంస్కృత నాటకాల ఆంధ్రీకరణ జరిగినది. వ్యాపార పద్ధతిని నాటక సమాజాలు వ్యాపించినవి. రాజమహేంద్రవరమున గున్నేశ్వరరావుగారు తెలుగుదేశమందలి ప్రఖ్యాతిచెందిన నటకులను పెద్ద వేతనాలు యిచ్చి తన కంపెనీలో నియమించుకొనెను. వివిధ దృశ్యాలతో కూడిన తెరలు, రంగురంగుల దుస్తులు వేషాలు తెలుగు నాటకరంగము మీద ప్రవేశించినవి. పాపట్ల కాంతయ్యగారు సంగీత దర్శకులుగా ప్రఖ్యాతిజెంది వారు రచించిన పార్సీ, హిందూస్తానీ మట్లు చెలామణిలోకి వచ్చినవి. 1904లో బందరులో జగన్మోహన సమాజము స్థాపితమైనది. ఇందులో స్త్రీలు, పురుషులు గూడ పాత్రలను ధరించిరి. ఈ కాలములో సురభి కంపెనీవారు భారత రామాయణ నాటకాలు వైర్‌వర్క్సు సహాయముతో అద్భుతముగా ప్రదర్శించి ఆంధ్రప్రజలను ఆకర్షించిరి. సురభి కంపెనీలో పాత్రధారులు అందరును స్త్రీలే యగుట గమనింపదగిన విశేషము. పురుషపాత్రలను గూడ స్త్రీలే ధరించెడివారు. మైలవరము కంపెనీ 1910-20 మధ్యన ఆంధ్రదేశములో గొప్ప కీర్తి గడించినది. ఈ

కంపెనీ గూడ ప్రఖ్యాతులైన నటకులను ఆకర్షక మైన వేతనాలమీద నియమించుకొనిరి. పాపట్ల కాంతయ్యగారి సంగీత దర్శకత్వ ఫలితముగా తబలా, హార్మోనియములు వ్యాప్తిలోకి వచ్చి చౌకబారు సంగీతముత్రో నాటకరంగము ప్రతిధ్వనించినది. యడవల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి సంజీవరావు గారలు ఈ కాలమందలి నటకులలో ప్రఖ్యాతి గాంచిరి. మైలవరం కంపెనీ పద్ధతిలో పల్లెపల్లెలో నాటక సమాజాలు స్థాపితమైనవి. ఈ కాలమునందలి నాటకములోరంగము యొక్క అలంకరణలో స్వాభావికత సహజత్వములోపించి,కృత్రిమత్వము ఆడంబరము అతిశయించినది.తెనాలిలో గోవిందరాజుల సుబ్బారావు, మాధవపెద్ది వెంకటరామయ్య, స్థానం నరసింహారావుగార్లు కన్యాశుల్కము, బొబ్బిలి, రోషనార, ప్రతాపరుద్రీయాది నాటకాలను అతి ప్రఖ్యాతి నొందిరి. బందరులో ముంజులూరి వారు, పింగళి సోదరులు, డి.వి. సుబ్బారావుగారలు, రాజమండ్రిలో ముప్పిడి జగ్గరాజుగార్లు పేరుమోసిన నటకులై కీర్తిగాంచిరి. ఈ కాలమున భరతుడు నిర్వచించిన అభినయ సాంప్రదాయాలను రంగస్థలానికి అనుగుణముగా మార్చు ప్రయత్నాలు జరిగినవి. ఈ ప్రయత్నాలు చేసిన వారిలో నెల్లూరిలో వేదం వెంకటరాయశాస్త్రి, దొరస్వామిగార్లు, బందరులో బి.టి. రాఘవాచార్యులు, నరసింహాచార్యులు గారలు ముఖ్యులు. ఈ ప్రయత్నాల ఫలితముగా నెల్లూరి వారి శకుంతల, బందరు వారి వేణీ సంహారనాటక ప్రదర్శనాలు తెలుగుదేశ మంతటను పేరుపొందినవి. 1922 వ సంవత్సరమున భరతశాస్త్ర సాంప్రదాయాల కనుగుణముగా పారుపల్లి సుబ్బారావుగారు రాధాకృష్ణ నాటక ప్రదర్శనము గావించిరి. తరువాత ఈ సాంప్రదాయము యెక్కువగా వ్యాపించినట్లు కనబడదు. మన నాటకాల మీద జాతీయోద్యమ ప్రభావము స్వదేశీయోద్యమ ప్రభావము గోచరించుచున్నది. 1920 వ ప్రాంతమున రసపుత్ర, మహారాష్ట్ర వీరుల చరిత్రలు మన నాటకాలకు ఇతివృత్తములైనవి. ఇటువంటి నాటకాలలో రసపుత్ర విజయమను నాటకమును అనాటి బ్రిటిషు ప్రభుత్వము నిషేధించినది. మన నాటకాల మీద వీరేశలింగం పంతులుగారి సంఘ

సంస్కరణోద్యమ ప్రభావము గూడ కనిపించుచున్నది. గురజాడ వారి కన్యాశుల్కమునకు వ్యావహారిక భాష, సంఘ సంస్కరణ ప్రధానాశయాలు. పానుగంటి వారి వృద్ధ వివాహ, కంఠాభరణాది నాటకాలలో సంఘ సంస్కరణ ఉద్యమ ప్రభావము కనిపించుచున్నది. ఈ కాలమున చింతామణి తెలుగుదేశము నంతటిని ఒక్క ఊపు ఊపిన నాటకము. మధుసేవ, వరవిక్రయాది నాటకాలు కూడ యీ తరగతిలోనే చేరుచున్నవి. నాటకాల వ్యాప్తితోపాటు పత్రికలలో నాటకాల మీద నటకుల మీద చర్చలు వ్యాసాలు ప్రకటితమైనవి. ఇవి నాటక కళాభివృద్ధికి చక్కగా ఉపకరించినవి. రంగస్థలములో ప్రత్యేకమైన మార్పులు జరుగలేదు 1920 వరకు తెరలు రంగస్థల పరికరాల మీద కృత్రిమత్వము ఎక్కువగా గోచరించినది. దుస్తులలో మాత్రము కొంత మార్పు జరిగి ఆడంబరము తగ్గి సాధారణత అతిశయించినది. 1920 నుండి ఆంధ్ర నాటక రంగములో ఒక క్రొత్త యుగము ప్రారంభమైనదని చెప్పవచ్చును. బళ్లారి రాఘవాచార్యుల వారి నాటకాలు యీ క్రొత్త యుగమును ప్రారంభించెను. ఆయన షేక్స్పియర్ నాటకాలు రవీంద్ర కవీంద్రుని పొగడ్తను గాంచి అఖిల భారత ప్రశస్తిని పొందినవి. ఆయన పఠాను, హిరణ్యకశిపు, రామరాజు, చాణక్యాది పాత్రలను నటించెడివారు. రాఘవాచార్యుల వారి నాటకాలు నటకులకు, ప్రేక్షకులకు క్రొత్త రుచులను చూపించినవి. ఆయన నటకలోకమునకు మార్గదర్శి యయ్యెను. ఆయన ప్రవేశ పెట్టిన క్రొత్త పద్ధతుల ప్రకారము నటకులకు శిక్షణ నిచ్చుట కొరకై బి.టి. రాఘవాచార్యులు, గూడవల్లి రామబ్రహ్మం గార్లు ఒక నాటక కళాశాలను స్థాపించిరి. దీని ప్రభావము చాలమంది నటకులపైన గోచరించినవి. రాఘవ ఇంగ్లండు వెళ్ళి వచ్చిన తరువాత స్త్రీలే స్త్రీ పాత్రలను ధరింపవలెనని, నాటకరంగము వాస్తవమునకు ఉపయుక్తము కావలెనని ఉద్ఘాటించిరి. ఆయన ప్రచార ఫలితముగా క్రమక్రమముగా సంసార స్త్రీలు నాటకాలలో వేషాలు వేయుట ప్రారంభించిరి. 1938—39 లలో ఏలూరులో బందా కనక లింగేశ్వరరావుగారు ఒక

ఆంధ్ర నాటక కళాశాలను స్థాపించి, కొందరికి అభినయములో శిక్షణ నిచ్చిరి. ఈ కళాశాల ప్రభావము చాలామంది మీద కనపడుచున్నది.

ఆంధ్రదేశము నందలి వివిధ పట్టణాలలో నాటక సమాజాలు స్థాపితమై యీ శతాబ్దాదిలో ప్రజలను నాటక ప్రదర్శనాలవైపు ఆకర్షించినవి. రాజమహేంద్రవరములో గున్నేశ్వరరావు, నాగేశ్వరరావుగార్ల నాటక సమాజాలలో అంకరాజు రామారావు, ముప్పిడి జగ్గరాజుగార్లు మొదలైనవారు ప్రసిద్ధ నటకులుగా పేరుగాంచిరి. ఈ కాలమున కీర్తిగాంచిన మరొక నటకుడు ఈమని లక్ష్మణస్వామి గారు. ఆయన పీష్వా నారాయణరావు వధ, శివాజీ, విశ్వామిత్రతపోభంగములలో చక్కగా అభినయించి నవరసాలు ఒప్పించెడివారు. ఏలూరులోని సీతారామాంజనేయనాటక సమాజము గొప్ప పేరుగాంచినది. యడవల్లి సూర్యనారాయణగారి దుష్యంత, దుర్యోధన, వత్సరాజు పాత్రలలో రాచఠీవి ఉట్టిపడుచుండెడిది. మైలవరము కంపెనీవారి నటకులలో జొన్నవిత్తుల శేషగిరి రావుగారి కృష్ణ, నారద పాత్రలు, కపిలవాయి రామనాధశాస్త్రి గారి అర్జున, సారంగధర పాత్రలు, గురజనాయుడు గారి భీమ, యమ పాత్రలు ఆకాలమున తెలుగుదేశ మంతటికిని సుపరిచితములు. సురభి కంపెనీవారి ప్రదర్శనలు ఆంధ్రదేశ మంతటిని ఆకర్షించినవి. గుంటూరు నుండి బలిజేపల్లి లక్ష్మీకాంతము గారు కవులుగా, నటకులుగా ప్రఖ్యాతిగాంచిరి. హరిప్రసాదరావుగారి హరిశ్చంద్రపాత్ర తెలుగుదేశ మంతటను ప్రఖ్యాతి పొందినది. ఆ రోజులలో స్త్రీవేషధారణకు నటకులు తక్కువ దొరికెడువారు. అట్టి పరిస్థితిలో కోపల్లి హనుమంతరావుగారు ముందుకు వచ్చి నాయికాపాత్రలను ధరించి నాటక కళావ్యాప్తికి కృషిచేసిరి. కోటంరాజు లక్ష్మీకాంతము గారి సత్యభామ పాత్ర, వేణీసంహారములో పత్రి గోపాలరావుగారి భీముని పాత్ర పేరు పొందినవి. నెల్లూరులో పర్వతరెడ్డి రామచంద్రారెడ్డి గారు అపర కబీరు అని ప్రసిద్ధిగాంచిరి. దొరస్వామి అయ్యంగారు, శ్రీనివాసాచారిగారు, నెల్లూరి నాగరాజా రావుగారు

ఆనాటి ప్రసిద్ధ నటకులలో ముఖ్యులు. తెనాలిలో ప్రభల అంజనేయులుగారి నలుని పాత్ర, మల్లాది గోవిందశాస్త్రిగారి కంసుని పాత్ర, నాగబసవయ్య గారి మోహిని పాత్ర, పిల్లలమఱ్ఱి సుందరరామయ్యగారి పాపారాయుడు, రాంసింగ్, సొహరాబ్ పాత్రలు ప్రఖ్యాతిగాంచినవి. కృష్ణపాత్రధారులుగా బెల్లంకొండ సుబ్బారావుగారు సకలాంధ్రదేశమునకు సుపరిచితులు. రంగారాయని పాత్ర, శ్రీకృష్ణ, కర్ణ, విద్యానాథ పాత్రలను చక్కగా నిర్వహించిన వారు శ్రీ కుటుంబశాస్త్రి గారు. మాస్టర్ అంజి కన్యాశుల్కములో రామప్ప పంతులు, అనసూయలో కౌశికుడు, కంఠాభరణములో సుబ్బలక్ష్మి ప్రహ్లాదలో పాములవాని పాత్రలను ధరించి గొప్ప పేరును గాంచిరి. గిరీశం పాత్రధారులుగా గోవిందరాజుల సుబ్బారావుగారు ప్రఖ్యాతి నొందిరి. గుడివాడలో పోతూరి శ్రీరాములుగారి నాటక సమాజము అనేక నాటకాలను ప్రదర్శించినది. మద్రాసులోని సుగుణవిలాస సభవారు యీ కాలమున మంచి నాటకాలను ప్రదర్శించిరి. వీరు ప్రదర్శించిన శ్రీ పి. వి. రాజమన్నారుగారి 'తప్పెవరిది' అను నాటకములో కీ॥ శే॥ బళ్ళారి రాఘవాచార్యులును అభినయించిరి. శ్రీ అబ్బూరి రామకష్ణారావుగారు Little Theatre Movement ద్వారా నాటక ప్రచారానికి కృషిగావించిన వారు తెలుగుదేశమున యీకాలమున లో వివిధ నాటక సమాజాలద్వారా మరియు వ్యక్తిగతముగా ఖ్యాతిభావంతులైన నటకులు, నాటక కళాభిమానులు నాటక ప్రచారానికి చక్కని కృషి గావించినారు. శ్రీ కొప్పరపు సుబ్బారావుగారు, శ్రీ స్థానం నరసింహారావుగారు, మాధవపెద్ది వెంకట్రామయ్య, వేమూరి గగ్గయ్య, ఈలపాట రఘురామయ్య, బందా కనకలింగేశ్వరరావుగారు, శ్రీ దంపరం రామారావు గారు, కె. వి. గోపాలస్వామిగారు మొదలైనవారు నాటక కళావ్యాప్తికి అపారమైన సేవ గావించిరి. 1930 తరువాత నాటక సమాజాల వ్యాప్తికి దెబ్బ తగిలినది, మైలవరము కంపెని అంతరించినది. నటులకు వేతనాలిచ్చి పోషించువారు లేకపోయిరి. పేరుపొందిన ఒక్కొక్క నటకుడు ఒక్కొక్క కంపెనీస్థాపించి దానిని సక్రమముగా నిర్వహించుకొనలేక ఆర్థికముగా దెబ్బతినిరి. అందుచేత కంట్రాక్టు నాటకాలు మొదలై

లాభాలు పెట్టుబడిదారుల చేతులలో పడుట ప్రారంభమై క్రమక్రమముగా నాటక కళ క్షీణించినది. పద్యాలు, పాటలు పాడగలిగిన ప్రతివాడు నటకుడయ్యెను. నటకుని దృష్టిలో అభినయమునకు ప్రాధాన్యము తగ్గినది. ధనము ప్రధానమై కళ అప్రధాన మయ్యెను.

1945 వ సంవత్సరమున ప్రజానాట్యమండలి స్థాపితమైనది. దీనికి కమ్యూనిస్టు పార్టీవారి సంపూర్ణ సహకారము లభించినది, దీనికి పల్లెపల్లెలో అనుబంధ శాఖలు వెలసినవి. వాసిరెడ్డి, సుంకరగార్లు రచించిన నాటకాలను నాట్యమండలి ప్రదర్శించినది. వీనిలో మాభూమి అను నాటకము దేశములో పేరు పొందినది. ఫ్లాష్‌లైట్ల ఉపయోగము ఆధునిక పద్ధతులు యీ నాట్యమండలి ప్రవేశ పెట్టినది. ఈ నాట్యమండలి పద్ధతిని బెజవాడ, రాజమండ్రి, వెంకటగిరులలో నాటక సమాజాలు స్థాపితములైనవి.

సినిమాల వ్యాపకమువల్ల యీనాడు నాటక ప్రదర్శనాల ప్రచారము మిక్కిలి తక్కువైనది. నేడు నాటక కళ కాలేజీ, హైస్కూలు విద్యార్థులసారస్వతసంఘాలనుఆశ్రయించి,వారివార్షికోత్సవాలలో ప్రదర్శితమగుచున్నవి. నాటక రచనా వ్యాసంగము కూడ యీనాడు తక్కువగనే కనిపించుచున్నది. నేటి నాటకాలలో శిల్పముయొక్క లోటు, ప్రతిభయొక్క లోపము స్పష్టముగా కనపడుచున్నది. దైనందిన సమస్యలు, రాజకీయ సమస్యలు ఇతివృత్తముగా తీసుకొనుచున్నారు నేటి నాటక కర్తలు. అయినను ప్రజాజీవితము వీనిలో చక్కగా ప్రతిబింబితమగుట లేదు. సినిమా ప్రభావము నాటక రంగము మీద కనపడుచున్నది. సౌండు ఫ్లాష్, ఫోటో ఫ్లాషులు ఎక్కువైనవి. నేడు రేడియోలలో నాటికలు ప్రదర్శితమగుచున్నవి. ఈ రేడియో నాటక రచయితలు కొంతమంది బయలు దేరుచున్నారు. అర్ధశతాబ్దముపైగా ప్రచారములో నున్నప్పటికిని మన దేశములో రంగస్థలము పాశ్చాత్య దేశాలలోవలె ఆధునిక పరికరాలతో సర్వసంపూర్ణము కాలేదు. మనకు చెప్పదగిన నాటకశాల లేదు. 1929లో స్థాపితమైన నాటక కళా పరిషత్తు ప్రతి సంవత్సరము పోటీ పరీక్షలనుపెట్టి

రచయితలను, నటకులను ప్రోత్సహించుచున్నది. ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వము సంగీత నాటక అకాడమీ స్థాపించినది. ఈ అకాడమి కూడ పోటీలను నిర్వహించుచున్నది. నాటక కళా వికాసమునకు దోహదము చేయు వలసిన కర్తవ్యము యీ అకాడమీ మీద కలదు.

ఈ కాలమున సంగీత చిత్రకళారంగములందు పునరుజ్జీవనమునకు బీజావాపన జరిగినది. ఆంధ్రదేశములో రెండు తరగతుల సంగీతము వ్యాప్తిలో నుండినది. ఇవి (1) శాస్త్రీయ సంగీతము. ఇది పరస్పర రాగిణీరాగములతో శాస్త్రీయపద్ధతిని ఆస్థానాలలో అభివృద్ధిచెందినది. (2) సామాన్య జనులలో వ్యాప్తియందుండిన సంగీతము జానపద సంగీతము. పాటక సంగీతము ఓడలను నడుపునపుడు వారు పాడు పాటలు స్త్రీలు ఇండ్లలో పాడుకొను పాటలు, వీధులలో చెప్పు వీరగాథలు ఇటువంటివి. అధ్యాత్మిక కీర్తనలు కొన్ని కలవు. వీనినే తత్త్వాలు అని చెప్పెదరు. మధ్యయుగమున కబీరు, మీరాబాయీలు రచించిన కీర్తనల వంటివి. వీనిని సాధారణముగా సామాన్య జనులు పాడుకొనెదరు. ఆధ్యాత్మిక భావయుక్తములైన పాటలను సామాన్య జనులు, జానపదగేయాలుగా పాడుకొనుట మన ప్రత్యేకత. ఇటువంటి పద్ధతి ఐరోపాఖండములో లేదు. ఈ పాటలలో ఆత్మ, పరమాత్మతో ఐక్యము పొందగోరు ఆకాంక్ష గోచరించుచున్నది. ఇట్టి పరిస్థితిలో మనకు పాశ్చాత్య సాంప్రదాయాలతో సంబంధముకలిగి దాని ప్రభావము దేశీయ సంగీతముపై పడినది. ఇందు వలన మిశ్రమ సంగీత మొకటి ఏర్పడినది. కాఫీహోటళ్ళు, రేడియోలు, సినిమాలద్వారా యీ సంగీతము రచ్చకెక్కినది. ఉన్నతవిద్య కొరకై ఇంగ్లండు మొదలైన విదేశాలకు వెళ్ళివచ్చినవారు పాశ్చాత్య సంగీతము చేత సమ్మోహితులైరి. ఇంతకుముందు శాస్త్రీయ సంగీతమును పోషించు చుండిన జమీందారులు, సంస్థానాధీశ్వరులు కాలప్రభావము వలన, అది అప్పటి ఫ్యాషన్ అనియో లేక స్వయముగా ఇష్టపడియో పాశ్చాత్య సంగీతమును అభిమానింపజొచ్చిరి. వివాహాది శుభకార్యాలయందు కూడ

ఈ సంగీతము ప్రాధాన్యము వహించి జనాకర్షణ పొందినది. బ్యాండు వాద్యము, హార్మోనియముల ప్రభావము మన సంగీతముమీద ఎక్కువగా పడినది.

పల్లెటూళ్ళు యీ ప్రభావానికి కొంత దూరముగా నుండినప్పటికిని, నగరాలకు, పట్టణాలకు రాకపోకల వలన పల్లెటూళ్ళలో కూడ యీ మిశ్ర సంగీతమును అభిమానించువారి సంఖ్య క్రమక్రమముగా అతిశయింపసాగెను. విద్యార్థికులు, కార్మికులు, పట్టణాలతో సంబంధ బాంధవ్యాల చేత ఈ పాశ్చాత్య పద్ధతి సంగీతమును పల్లెటూళ్ళలోకూడ మెల్ల మెల్లగా వ్యాపింపజేసిరి.

భారతదేశ సమాజములో అభిరుచులయందు, వేషభాషలయందు ప్రవేశించినటువంటి, ఆధునిక పరివర్తనాలవంటి పరివర్తనాలే సంగీతమునందు కూడ ప్రవేశించినవి. పట్టణాలలోని హార్మోనియమువంటిపాశ్చాత్య సంగీత పరికరాలు పల్లెటూళ్ళకు దిగుమతి కాజొచ్చెను. వయొలిన్ ఇటువంటి పరికరాలలో మరియొకటి. ఈ పరికరాలను దేశీయ పద్ధతి ప్రకారము కూడ వాయింపవచ్చును. అట్లు వాయించుట జరుగుచున్నది కూడ. కొన్ని ఆధునిక సంగీత పరికరాల ప్రభావము చెడ్డదిగా నున్నది. ఇందులో హార్మోనియము ముఖ్యమైనది. ఇది ప్లేగుజాడ్యము వలె మన సంగీత ప్రపంచమున ప్రవేశించి, పల్లెపల్లెకు వ్యాపించి, సంగీతములోని శ్రావ్యతను ధ్వంసము కావించినది. భారతీయ సంగీతములోని సొగసును హార్మోనియము నిర్మూలించుచున్నది. చౌకయైనందు వలన యీ హార్మోనియములను విద్యార్థులు, కార్మికులు, సామాన్య ప్రజలు ఉపయోగించుట జరిగినది. ఇందువలన జానపద సంగీతములోని శ్రావ్యత చెడిపోయినది.

ప్రాచీన కాలమున ఆంధ్రులు భారతీయ సంగీతములో గొప్ప అభివృద్ధిని తీసుకొనివచ్చిరి. విజయనగర రాజులు మన దేశమును పాలించిన కాలమున తెలుగువారు సంగీత కళకు పెంపుసొంపులు సమకూర్చిరి.

కర్ణాటక సంగీతమును గూర్చి స్వరమేళ కళానిధి అను గ్రంథమును వ్రాసిన రామయామాత్యుడు విజయనగర రామరాయలచే కొండవీడు పాలకుడుగా నియమింపబడెను తరువాత ముస్లింల కాలమున సంగీతముమీద వారి ప్రభావము మిక్కిలి తక్కువగానే కానవచ్చుచున్నవి. తంజావూరు మరియు తమిళదేశమందలి ఇతర ప్రాంతాలు కర్ణాటక సంగీతానికి కేంద్రము లైనవి. అందుచేత తెలుగువారు సంగీతములో మెప్పుపొంద వలెనన్నచో దక్షిణదేశములో శిక్షణ మరియు ఆమోదముప్ర పొందవలసివచ్చెను. ఇంగ్లీషువారి కాలమున చెన్నపట్టణమే విద్యావిజ్ఞానాలకు, కళలకు కేంద్రమైనది. ఆంధ్రదేశములోని జమీందారీలైన బొబ్బిలి, పిఠాపురము, విజయనగరము, వెంకటగిరి, కార్వేటి నగరాలయందు సంస్థానాధీశ్వరులు తమ ఆస్థానాలలో సంగీత విద్వాంసులను నియమించి పోషించిరి. కాని యీ కాలమున సంగీత రంగమునందు జరిగిన పరిశోధనగాని, ప్రతిభతో కూడిన నూతన కృషిగాని స్వల్పము. పాత పద్ధతియే, పోషణనొందుచు ప్రచారములో నుండెను. ప్రతిభావంతులు రాణించి, కీర్తిని పొందవలెనన్నచో చెన్నపట్టణము రావలసియుండెను. అందుచేతనే బొబ్బిలి కేశవయ్య అను సంగీత విద్వాంసుడు ఆంధ్ర దేశ మంతయు తిరిగి మద్రాసు వచ్చిచేరెను. బొబ్బిలి కేశవయ్య నిజముగా బెబ్బులివంటివాడు. ఆయన ఆస్థానాలన్నింటిని తిరిగి అక్కడి సంగీత విద్వాంసులను పోటీలలో ఓడించెను. ఆయన చేత ఓడింపబడిన సంగీత విద్వాంసులు తమ ఓటమియొక్క గుర్తుగా ఆయనకు తమ తంబూరాలను యిచ్చిరి. ఆయన శరభోజి పరిపాలనా కాలమున తంజావూరు వెళ్ళినప్పుడు తన వెంబడి శాలువలను, తంబూరాలను కొన్ని బండ్లలో నింపుకొని వెళ్ళెనని చెప్పుదురు. బొబ్బిలి కేశవయ్య "భూలోక చాపచుట్టి" అను బిరుదాంకితుడు. లోక మంతను జయించి నట్లును ఈ బిరుదు తెలుపుచున్నది. ఆయన మద్రాసులో స్థిరనివాసము కల్పించుకొనెను. మద్రాసులో స్థిరనివాసము కల్పించుకొన్న మరొక ఆంధ్ర సంగీత విద్వాంసుడు పైడాల గురుమూర్తి శాస్త్రిగారు. ఈయన

18 వ శతాబ్దమువాడు. పురందరదాసు తర్వాత గీతావళి రచనలో ఇంత గొప్పవాడు లేడని చెప్పెదరు. అందుచేతనే అయనకు వేయిగీత పైశాల్నీగురుమూర్తిశాస్త్రి, నలుబదివేల రాగాల గురుమూర్తి శాస్త్రి అను బిరుదులుండెను. అయన లక్షణగీతాలు, సంచారిగీతాలు ప్రబంధాలు, కీర్తనలు అసంఖ్యాకములుగా రచించెను. ఆ కాలమున అయన లక్ష్య లక్షణములలో అద్వితీయ విద్వాంసుడుగా పేరుపొందెను. అయనగీతా లన్నియును సంస్కృతభాషలోనే రచించెను. అప్పటి తంజాపూరు రాజు ఆయన ప్రతిభను మెచ్చుకొని అయనకొక పల్లకిని బహుమానము గావించెను. గురుమూర్తిశాస్త్రిగారి కుమారుడు సుబ్బారామశాస్త్రి కూడ గొప్ప సంగీత విద్వాంసుడు. అనేక వర్ణాలను రచించెను.

త్యాగరాజు మరియు అయన శిష్యులు న్యాయముగా తెలుగువారే, త్యాగరాజు శిష్యుడైన వీణకుప్పయ్యర్ తమిళుడు. ఈయన మదరాసునకు 14 మైళ్ళ దూరమున నున్న కొవ్వూరు అను తెలుగుపల్లెలో సంస్థాన విద్వాంసుడుగా నుండెను. ఈయనవల్లనే త్యాగరాజు మద్రాసు వెళ్ళెనని చెప్పెదరు. త్యాగరాజు శిష్యులలో సీతారామయ్య, త్యాగయ్య అనువారు ప్రతిభావంతులు. వీణకుప్పయ్యర్ పాశ్చాత్య సంగీతములో కూడ ప్రవీణుడు. అందుచేత ఫోర్టుసెంట్‌జార్జిలో జరిగెడి సంగీత సభలకు ఈయన ఆహూతు డయ్యేడివాడు. దక్షిణదేశీయ సంగీత విద్వాంసులలో త్యాగరాజు, ముత్తుస్వామి, దీక్షితార్లమీద పాశ్చాత్య సంగీతప్రభావము కనపడుచున్నది. దీక్షితార్ పాశ్చాత్య సంగీతముచే ఆకృష్టుడై ఐరోపా సంగీత సాంప్రదాయానుగుణముగా కొన్ని పదాలు రచించెను. సంస్కృతములో "సంతతంపాహిమామ్" అను సాహిత్యమును బ్రిటిషు జాతీయగీతమైన గాడ్ సేవ్ ది కింగ్ అనుదాని వలె రచించెను. యూరోపియన్ వయొలిన్ ప్రవీణులవద్ద వయొలిన్ వాద్యము నేర్చుకొన్న బాలుస్వామి, దీక్షితార్ త్యాగరాజుకు పాశ్చాత్య సంగీతము వినిపించెను. త్యాగరాజు రచించిన పాహి రామచంద్ర వతలీలా

గానలోల, రమించు వారెవరు మొదలైన కీర్తనలమీదపాశ్చాత్య సంగీత ప్రభావము కలదని సంగీత విద్వాంసులు చెప్పెదరు. మద్రాసులో తన సంగీత మాధుర్యముచే త్యాగరాజు జనాకర్షణ పొందెను. ఆయన శిష్యుడైన వీణకుప్పయ్యార్ చైత్రపౌర్ణమి, వినాయక చవితివంటి పండుగులలో ఉత్సవాలను జరిపించెడివాడు. ప్రతి సంవత్సరము దక్షిణదేశమందలి సంగీత విద్వాంసులు అనేకులు ఈ ఉత్సవాలలో పాల్గొనెడివారు. వీణకుప్పయ్యార్ తరువాత ఆయన కుమారుడు త్యాగయ్యార్ తండ్రిగారి సత్ సాంప్రదాయాలను పాటించెను. మద్రాసు జార్జిటౌన్ లోని ఆయన గృహము సంగీత కేంద్రమయ్యెను. 1834 నుండి 1892 వరకు జీవించియుండిన అద్వితీయ ప్రతిభావంతుడైన సంగీత విద్వాంసుడు తచ్చూరి సింగరాచార్యుడు. ఈయన 19 వ శతాబ్దపు తుదిలో మద్రాసునందు స్థిరనివాసము కల్పించుకొనెను. ఈయన వలన మద్రాసు సంగీత రంగమున క్రొత్త దశ ప్రారంభమైనది. సింగరాచార్యులు సంస్కృతాంధ్రములందు నిష్ణాతుడైన పండితుడు. సంగీత సిద్ధాంతములను, సాంప్రదాయములను, చరిత్రను చక్కగా తెలుసుకొన్న విజ్ఞుడు. అపారమైన విద్వత్తు కలిగిన ప్రతిభావంతుడు. సాధారణ, అసాధారణ రాగాలతో ఆయన అనేక రచనలు గావించినాడు. అందుచేత 19 వ శతాబ్దము తుదిలో మద్రాసు సంగీతకళారంగమున ఆయన ప్రధాన పురుషుడుగా నుండెను. తమ్ముడైన చిన సింగరాచార్యుని సహాయముతో తెలుగులో ఆయన చక్కని సంగీత గ్రంథములు వ్రాసెను. ఈ సోదరులు జార్జిటౌన్‌లో నివసించెడివారు. ఈ సోదరులు శ్రీరామనవమి సందర్భాలలో రామమందిరమున ఏర్పాటు చేసిన సంగీత సభలలో వేలకొద్ది జనులు పాల్గొనెడివారు. మద్రాసుకు క్రొత్తగా వచ్చిన ప్రతి సంగీత విద్వాంసుడు అనాడు సింగరాచార్యుల సమక్షములో సంగీత ప్రదర్శన గావించి, మెప్పు పొందవలసి యుండెను. అప్పుడే అతనికి సన్మాన గౌరవాలు లభించెడివి. ఈ సోదరులు అనేక శిష్యులకు శిక్షణ నిచ్చిరి. ఈ శిష్యకోటిలోనివాడు కాళహస్తి,

వీణ వెంకటస్వామి రాజు, అడ్డగంటి వీరాస్వామి, గురుమూర్తి, మొదలైనవారు మద్రాసులో నివసించి తెలుగు సంగీతపరులు. అల్లూరి వెంకటాద్రిస్వామి, ట్రిప్లికేన్‌లో నివసించిరి. భద్రాచల రామదాసు సాంప్రదాయానికి చెందిన అదినారాయణదాసు మాంబళములో నివసించెను. ఆయన శ్రీ రామనవమి ఉత్సవాలు వేలకొద్ది ప్రజలను ఆకర్షించెను. మద్రాసులోని ధనుర్మాస భజనలు ప్రసిద్ధిచెందినవి. ఎణ్ణయ్యా భాగవతార్ ధనుర్మాస భజనలతో సంబంధము కలిగిన ప్రసిద్ధుడు.

సంగీత పోషకులను గూర్చి కూడ ప్రస్తావన అవసరము. ప్రతి సంవత్సరము ఉత్తమ నాగస్వరము నూదినవారికి జూటూరి సుబ్రహ్మణ్య శెట్టి ఒక నిధిని స్థాపించి పారితోషికము లిప్పించుటకు ఏర్పాటు చేసెను. జూన్ నెలలో పెరియాళ్వారు ఉత్సవాల సందర్భమున ప్రతి సంవత్సరము యీ నాగస్వరము నూదు ఉత్తమ సంగీతపరుని ఆహ్వానించి పది రోజులు వీనులవిందు చేసుకొని సన్మానించెడివారు. ట్రిప్లికేన్‌లో పార్థసారథిస్వామి కోవెలలో అనేక సంగీత సభలు జరిగెడివి. త్యాగరాజును గూర్చి వ్రాసిన తిరుమలయ్యా నాయుడు, గానవిద్యా సంజీవని వంటి తెలుగు గ్రంథాలను రచించెను. ఈయన మద్రాసులోనే యుండెను. ఈయన గొప్ప సంగీత విమర్శకుడు. సంగీత సత్ సాంప్రదాయ దీపిక అను మొదటి సంగీత పత్రిక మద్రాసు నుండి వెలువడినది. తెలుగుదేశములోని ముఖ్య పట్టణాలలో ప్రసిద్ధ సంగీత విద్వాంసులుండిరి. వీరందరు సాంస్కృతిక పునరుజ్జీవమునకు దోహదము గావించినవారె. వీరిలో చాలమందికి ప్రతిభకు తగిన పోషణ దొరకలేదు. పోషణలేక ఉపరికముచే ప్రతిభ అణగారిన నిదర్శనాలున్నవి. కొన్ని సందర్భాలలో జమీందారులు, ధనవంతులు వీరిని పోషించిరి. కాని మనకు ఆ విషయమై తగినన్ని వివరాలు దొరుకుటలేదు. వీనిని పరిశోధించి తెలుసుకొనవలసి యున్నది.

విజయనగరమున 1919 వ సంవత్సరమున సంగీత కళా శాలను మహారాజాగారు ప్రారంభించిరి. ఇందులో ద్వారం వెంకట స్వామి గారు ప్రధానపెరుగా పనిచేసిరి. నాయుడుగారు ఆంధ్రదేశ సంగీత పరులలో అగ్రగణ్యులు. ఫిడేలు వాద్యమున వారిని మించినవారు లేరు. అందులో వారు అఖిలభారత ప్రఖ్యాతిని పొంది రాష్ట్రపతిచే బహుమతినికూడ పొందిరి. బెంగుళూరు నాగరత్నం ఈ కాలమున గొప్ప ప్రఖ్యాతివహించిన సంగీతపరురాలైన విదుషీమణి.

కర్ణాటక సంగీతము త్యాగరాజు జీవితకాలములో అభివృద్ధిచెంది 1767–1847 ఉన్నతస్థాయికి వెళ్ళినది. దేవుడు అయ్యా, దక్షిణామూర్తి శాస్త్రిగారలు కలిసి రచించిన గర్భపురి కృతులు ఎక్కువగా ప్రచారములోనికి వచ్చినవి. దేవుడు అయ్యాగారు ప్రఖ్యాత ఫిడేలు వాద్యకులు. పల్లవి శేషయ్యగారు 1846–1908 వరకు జీవించిన లక్ష్యలక్షణ విద్వాంసుడు. వీరి తండ్రి సుబ్బయ్యగారు త్యాగరాజు శిష్యులు. అనేక మధురమైన కృతులు, పర్ణాలు, తిల్లానాలు, శేషయ్యగారు రచించిరి. చెంగల్వాయ శాస్త్రిగారు గొప్ప వాగ్గేయకారకులు. అనేక కృతులను రచించిరి. సంస్కృతాంధ్ర భాషలలో సంగీత భరతనాట్యాలలో ప్రవీణులు. వారి సుందరేశ విలాసము గొప్ప సంగీత నాటకము. విద్వాల

నారాయణస్వామిగారు ఈ శతాబ్దము మొదటి వరకు తిరుపతిలో నుండి చక్కని జావళీలు, కృతులు తెలుగులో రచించెను. సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిగారు, తంజావూరులో త్యాగరాజు శిష్యులైన వెంకటసుబ్రహ్మణ్య అయ్యగారి వద్ద సంగీత శిక్షణ పొంది, మచిలీపట్టణములో చాలమంది శిష్యులకు శిక్షణ నిచ్చిరి. ఆయన కాలములో మచిలీపట్టణము సంగీతానికి కేంద్రమైనది. బందరు వాస్తవ్యులైన హరినాగభూషణం గారు ఫిడేలు వాద్యములో ప్రవీణులు. జంగం కోటయ్యగారు గొప్ప గాయకులు. వీరిది కూడ బందరే. ప్రఖ్యాత వైణికులు సంగమేశ్వర శాస్త్రిగారు 1874-1932 మరియు గాయకులైన నందిగామ వెంకన్న

గారు బొబ్బిలి వాస్తవ్యులు. విజయనగరములో ప్రఖ్యాత వైణికు లనేక మంది బయలుదేరిరి. వీణ వెంకటరమణదాసు గారు 1866-1948 షట్కాల చక్రవర్తి బిరుదాంకితులైన గొప్ప వైణికులు. స్వయముగా అనందగజపతి మహారాజు గారు వైణికులు, వాగ్గేయ కారకులు. సంగీత ములో గొప్ప ప్రతిభాశాలురై, వాద్యకులు, గాయకులు, వాగ్గేయకారకు లునై అనేక హరికథలను రచించి చెప్పిన ఆదిభట్ల నారాయణదాసుగారు విజయనగరం మహారాజుగారి సంగీత కళాశాలకు ప్రిన్సిపాల్‌గా పనిజేసిరి. వెంకటగిరి, కార్వేటి సంస్థానాలలో సంగీతపోషణ జరిగినది. ఆంధ్రదేశ ప్రముఖ గాయకులైన పారుపల్లి రామకృష్ణయ్యగారు లక్ష్యలక్షణ విద్వాం సులు. క్షేత్రయ్య పదాల వ్యాప్తికి గుంటూరువారైన పర్వతనేని వీరయ్య చౌదరీ గారు ప్రత్యేక కృషిసల్పిరి. కూచిపూడి నాట్యములో వేదాంతం లక్ష్మీనారాయణగారు ప్రసిద్ధులు. సంగీతశాస్త్రానికీ, చరిత్రకు గొప్ప సేవ గావించి, రచనలు చేసినవారిలో టి. వి. సుబ్బారావు, విస్సా అప్పారావు, వరాహ నరసింహాచార్యులవారిని పేర్కొనవలసి యున్నది. సంగీతము లోను, స్వరాలలోను, జి. వి. సీతాపతిగారు పరిశోధనలు గావించిరి. సమకాలిక వాగ్గేయకారులలో గుంటూరు వెంకట నారాయణాచార్యులు, బెజవాడ బాలమురళీకృష్ణ గార్లను ప్రత్యేకముగా పేర్కొనవలెను. అరిపిరాల సత్యనారాయణమూర్తి, కె. వి. యస్. యమ్. గిర్మాజీరావు, ఎం. సి. పార్థసారధి అయ్యంగార్ మొదలైనవారు సంగీతముపై గ్రంథాలు వ్రాసిరి. సరస సాహిత్యసంపన్నులు, సంగీత కళాకోవిదులైన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు, తాళ్ళపాకవారి పదాలకు స్వరకల్పనము చేసి బహుళ ప్రచారము కల్పించుచున్నారు.

అధునిక కాలమున భారతీయ చిత్రకళ తగినంత వికాసము పొందలేదు. ఈస్టిండియా కంపెనీ కాలమున కొందరు నవాబులు సంస్థానా ధీశ్వరులు భారతీయ చిత్రకళను ఆదరించిరి. అయితే ఐరోపా కళా ప్రభావమునకు లోనైన చిత్రకళచే వీరు వ్యామోహితులైరి. పాశ్చాత్య

చిత్రకళ సాంప్రదాయాల పద్ధతిని పురాణ కథలను చిత్రించిన రవివర్మ సులభముగా జనాకర్షణ పొందెను. ఇందువలన భారతీయ చిత్రకళకును, సాంప్రదాయాలకు దెబ్బ తగిలినది. అభిరుచులలో కూడ పాశ్చాత్య ప్రభావము ప్రాధాన్యం వహించినది. ఫొటోగ్రఫ వచ్చిన తరువాత మన చిత్రకళా వికాసమున తీవ్రప్రతిబంధకము కలిగినది. ఉత్తమ కళాభిరుచి సన్నగిల్లినది.

చిత్రకళలో యీ కాలమున వంగరాష్ట్రము నందు అవనీంద్రనాథ టాగూర్ మరియు ఆయన అనుయాయులైన అసితకుమార హల్దార్, నందలాల్‌బోస్‌లు ఒక క్రొత్త విధానాన్ని ప్రవేశ పెట్టిరి. వీరిపైన పూర్వ పద్ధతుల యొక్క మరియు అజంతా చిత్రకళ యొక్క సాంప్రదాయ ప్రభావములు కన్పించుచున్నవి. వీరియొక్క ప్రభావము ఆంధ్రదేశ చిత్రకళమీద కూడ కన్పించుచున్నది. ఆంధ్రదేశమున మచిలీపట్టణములో ఆంధ్ర జాతీయ కళాశాల యందు ప్రమోదకుమార ఛటోపాధ్యాయ, అడవి బాపిరాజుగార్లు మరియు రాజమండ్రిలో కూల్డ్రే, దామెర్ల రామారావు గార్లు అధునికాంధ్ర చిత్రకళా వికాసమునకు మెరుగు దిద్దిరి. మద్రాసు చిత్రకళా సాంప్రదాయ స్థాపన మరియు దేవీప్రసాదరాయ్ చౌదరీ ప్రభావము ఆంధ్రదేశ చిత్రకళా వికాసమునకు తోడ్పడినది. బొంబాయి చిత్రకళాశాలలో ఉత్తీర్ణుడైన దామెర్ల రామారావు 1921 వ సంవత్సరమున రాజమహేంద్రవరమున ప్రవేశించెను. అప్పటివరకు ఆంధ్రదేశములో చిత్రకళ క్షీణదశలో నుండెను. దామెర్ల రామారావుగారి యందు బొంబాయి, బెంగాలు, రాజపుత్ర చిత్రకళారీతుల ప్రభావముతోపాటు అజంతా చిత్రకళా ప్రభావము కూడ గోచరించుచున్నది. నవ్యాంధ్ర చిత్రాకళారీతికి స్థాపకుడై దామెర్ల రామారావు ఆంధ్రదేశానికి గౌరవము తెచ్చెను. రామారావు చిత్రములు మిక్కిలి ప్రఖ్యాతి గాంచినవి. ఈయన రాజమహేంద్రవరములో చిత్రకళా సంస్థను స్థాపించి చాల మందికి శిక్షణ నిచ్చెను. ఈ సంస్థలో ఉత్తీర్ణులైన వరదా వెంకట రత్నం, చేమకూర సత్యనారాయణ మొదలైన యువకులు ప్రఖ్యాతి

గాంచిరి. బందరులో ప్రమోదకుమార ఛటర్జీగారు, అడవి బాపిరాజుగారి ప్రతిభను గుర్తించి దోహదము గావించిరి. గుఱ్ఱం మల్లయ్య, కౌతా రామమోహన ఆనంద మోహనులు, కేశవరావు బందరులోనే శిక్షణ బడసిరి. 1928 లో దేవీప్రసాదరాయ్ చౌదరీ అధ్వర్యాన మద్రాసు ప్రభుత్వ చిత్రకళాశాలలో శిక్షణ పొందిన మాధవపెద్ది గోఖలే, పిలకా నరసింహమూర్తి, పైడిరాజు మొదలైన యువకులు ఆంధ్రచిత్రకళా రంగమున కీర్తి గాంచినారు. శాంతినికేతన చిత్రకళలో శిక్షణ పొందిన వి. ఆర్. చిత్ర, బొంబాయి చిత్రకళాశాలకు సంబంధించిన చేమకూర భాష్యకారరావు, చావలి నాగేశ్వరరావు, సి. వెంకట్రావు గారలను యీ సందర్భమున పేర్కొనవలసి యున్నది. నేటి చిత్రకారులలో శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి, శ్రీ యం. శ్రీరామమూర్తి, శ్రీ అంకాల వెంకట సుబ్బారావుగార్లను ప్రత్యేకముగా ప్రశంసించవలసి యున్నది. కీ. శే. తలిశెట్టి రామారావు గారు వ్యంగ్య చిత్రాలను వ్రాయుటలో గొప్ప నేర్పును ప్రదర్శించిరి. వారి భారతీయ చిత్రకళ అను గ్రంథము ఒక మంచి సమీక్ష. నేడు ఆంధ్ర దేశమున చిత్రకళను గూర్చి విమర్శనాత్మక వ్యాసాలు వ్రాయువారుకలరు. వీరిలో స్వర్గీయ శ్రీ ముట్నూరు కృష్ణారావుగారు అగ్రగణ్యులు. శ్రీ పి. ఆర్. రామచంద్రరావుగారు, శ్రీ సూర్యదేవర సంజీవదేవుగారు నేటి చిత్రకళా విమర్శకులలో పేర్కొనదగినవారు.

ఆంధ్రదేశములో యీ కాలమున శిల్పము అభివృద్ధి చెందలేదు. బ్రిటిషు పరిపాలన భారతదేశ శిల్ప వాస్తు సంపదలయొక్క సొగసును సరిగా గుర్తించలేదు. భారతీయులకు సంబంధించిన ప్రతిదానిని తెగడుటయే వారి యుద్దేశ్యమై యుండెను. లార్డు విలియం బెంటింక్ వంటి ఉదార భావసంపన్నుడైన గవర్నర్ జనరల్ కూడ ఇట్టి మనస్తత్వమునే ప్రదర్శించెను. ఒకమారు అయన తాజ్‌మహల్‌ను పడగొట్టి అందలి స్ఫటిక శిలలను వేలము వేయవలెనని సంకల్పించెనట. కాని ఆగ్రా రాజభవనము నందలి స్ఫటిక శిలయొక్క మచ్చుతునకలు వేలములో సరి

యైన ధరను తీసుకొని రాలేకపోయినందువలన ఆయన యీ ప్రయత్న మును ఉపసంహరించుకొనెను. మనదేశమున 19 వ శతాబ్దపు తుదిసగములో పి.డబ్ల్యు.డి. శాఖ నిర్మాణము జరిగినది. భారతీయ శిల్పమును న్యూనత పరచు మనస్తత్వమే యీ పి.డబ్ల్యు.డి. శాఖ వ్యక్తీకరించినది. రూర్కి ఇంజనీరింగు కళాశాలలో భారతీయ శిల్పము తీవ్రవిమర్శకు గురి యైనది. మనదేశములో శిల్పనిలయాలను కట్టడాలను కట్టుఆసక్తి లేకుండెను. కాలువలు, రోడ్లు, వంతెనలు, రైల్వేలు, బ్రిటిషు వారు నిర్మించి నప్పటికిని అందులో శిల్పకళా లక్ష్మి తాండవించలేదు. అటువంటి శిల్ప మును వారభిమానించలేదు. నేటి నిర్మాణాలలో ముఖ్యమైనది విజయ వాడ దక్షిణముననున్న కృష్ణానది ఆనకట్ట, ధవళేశ్వరమునకు దగ్గరగా నున్న గోదావరి నదిపై ఆనకట్ట. ఇందులో శిల్ప సౌందర్యమునకు చోటు లేదు. హైద్రాబాదు మొదలైన సంస్థానాలలో కొంతవరకు స్ఫటిక శిలా శిల్పమునకు ప్రోత్సాహము కలిగినది. భారతీయ శిల్పాల పరిరక్షణను గూర్చి శ్రద్ధవహించినవాడు లార్డ్ కర్జన్. రాజకీయ రంగములో ఆయన ఎటువంటి వాడైనప్పటికి, భారతీయ శిల్పమును అభిమానించి మన దేశ ములో ఆర్కియాలజీ శాఖను ఆయన నెలకొల్పెను. ఇందువలన పూర్వ శిల్పాల భద్రత జరిగినది కాని నూతన నిర్మాణము జరుగలేదు. క్రొత్తఢిల్లీ పట్టణ నిర్మాణములో భారతీయ శిల్పానికి ప్రాధాన్యము లేదు.

కూచిపూడి సాంప్రదాయమునకు చెందిన నృత్యకళ తెలుగుదేశము యొక్క విశిష్టత. మణిపూర్ కథాకలి నృత్యాలలో ఆంగికానికి ప్రాధా న్యము ఉన్నది. కాని వాచికానికి ప్రాధాన్యములేదు. కూచిపూడి నృత్య మటువంటిదికాదు. వాచికము లేని నృత్యాలకు తెలుగుదేశములో ప్రత్యేక స్థానము లేదు. కథాకలి మణిపూరు సాంప్రదాయ ప్రభావము ఆధునిక కాలమున మనదేశ నృత్యకళమీద పడినది. సినిమాల ద్వారా యీ రెండు సాంప్రదాయాలు మనదేశములో వ్యాపించినవి. ఏబది సంవత్సరాల క్రిందివరకు మనదేశములో కూచిపూడి వారు తప్ప స్త్రీలైనను పురుషు

లైనను నృత్యము, నాట్యము నేర్చుకొనుట గౌరవముగా భావించలేదు. కాని యిప్పుడు అభిప్రాయాలు మారుచున్నవి. అన్ని వర్ణాలవారు తమ పిల్లలకు నృత్యము, నాట్యము నేర్పించుచున్నారు. బి.వి. నర్సింహారావు గారు భరతము చక్కగా అభ్యసించి పదాభినయములో క్రొత్త త్రోవ దొక్కి, పూర్వపద్ధతి క్షేత్రయ్య పదాలేకాక యీనాటి యెంకిపాటలు మొద లైన వానిని కూడ అభినయించి నాట్యమునకు గౌరవస్థానము కలిగిం చుటకు కృషి చేయుచున్నారు. కిన్నెరసాని పాటల అభినయము కూడ చేసిన ప్రదర్శనాలున్నవి. విస్సా అప్పారావు గారివంటి పెద్దల సహకార ముతో నటరాజ రామకృష్ణవంటి యువకులు, భరతనాట్య కళను ప్రజ లలో ప్రచారము చేయుటకు కృషి జేయుచున్నారు. వ్యాసాలువ్రాసి, ఉపన్యాసాల నిచ్చి, శిక్షణ నొసంగుచు యీ రంగములో కృషి చేయు చున్నారు. భాగవతుల కుటుంబశాస్త్రి, కృష్ణమూర్తి, తాండవ కృష్ణ, బి. వి. నరసింహారావు, బి.వి. నారాయణస్వామి, వేదాంతం పార్వతీశం, వేదాంతం రాఘవయ్య, సిద్దాబత్తుల రాఘవయ్య, సువానరము సత్యనారా యణ, మహంకాళి సత్యనారాయణ, వెంపటి సత్యం, లంక సూర్యనారా యణశాస్త్రి, పోతుకూచిసుబ్రహ్మణ్యశాస్త్రి మొదలైనవారు.

గడచిన రెండు దశాబ్దాల క్రిందివరకు మన దేశములో పౌరాణిక గాథలే బుఱ్ఱకథలుగా నుండెను. వీనిలో పల్నాటి వీరచరిత్ర, బొబ్బిలి కథ, మరాఠీల కథ, బాలనాగమ్మ కథ, భారత, రామాయణ కథలు, కామమ్మ కథలు ముఖ్యమైనవిగా నుండెడివి. యీ కథలను చెప్పుటలో కొందరు ప్రఖ్యాతి గాంచిన వారుండిరి. సమకాలిక సమస్యలకు సంబం ధించిన కథలను తీసుకొని బుఱ్ఱకథలను వ్రాసిన వారిలో సుంకర సత్య నారాయణగారు ముఖ్యులు. వారి కష్టజీవి, అల్లూరి సీతరామరాజు వీరేశలింగం కథలు ప్రజాదరణ పొందినవి. నాజరు మొదలైనవారు కూడ ఇదే రీతిగా కథలు వ్రాసి చెప్పుచున్నారు. ఈ కథలలో రాజకీ

యాలు ప్రాధాన్యము వహించుచున్నవి. ఇట్టి కథలు చెప్పుటకు నాయర్ మొదలైనవారు ప్రవీణులు.

ఇటీవల మట్టుకు మన దేశములో హరికథలు ఎక్కువ ప్రచారములో నుండెను. ఇప్పుడు వాని ప్రాధాన్యము తగ్గిపోయినది. ఈ హరికథలను చెప్పుటలో ఆదిభట్ల నారాయణదాసుగారు గొప్ప ప్రఖ్యాతి వహించిరి. వీరు సంగీత సాహిత్యములలో మంచి ప్రతిభా సంపన్నులు. బాలాజీదాసు మొదలైనవారు మన దేశమున హరికథలు చెప్పుటలో పేరు బొందిరి. చంద్రశేఖరంగారు చిత్రవేషధారణ యందు ప్రఖ్యాతి గాంచిరి.

1931వ సంవత్సరము వరకు మనదేశమున మూకి చిత్రాలు మాత్రమే ప్రవేశించెను. పుల్లయ్యగారి మార్కండేయ ఇటువంటి చిత్రము. ఇది కాకినాడ ప్రాంతాలలో సిద్ధమైనది. ఇందులో పుల్లయ్యగారు యముని వేషము వేసిరి. 1931వ సంవత్సరమున హెచ్. ఎం. రెడ్డిగారు మద్రాసులో భక్తప్రహ్లాద మొదటి తెలుగు టాకీ చిత్రము సిద్ధముచేసిరి. క్రమ క్రమముగా కొన్ని పౌరాణికచిత్రాలు, తరువాత సాంఘికచిత్రాలు వచ్చినవి. తెలుగు చిత్రనిర్మాణము 1931లో ప్రారంభమయినప్పటికిని నేడు తెలుగుదేశములో ఒక స్టూడియో కూడలేదు. ఒకటి రెండు ప్రయత్నాలు జరిగినను అవి ఫలించలేదు. 1950 నుండి ఆంధ్రులు మద్రాసులో స్టూడియో నిర్మాణము ప్రారంభించిరి. ఇప్పుడు మద్రాసులో ఆంధ్రస్టూడియోలున్నవి. వీనిలో వాహిని అనునది ఖండమునందలి స్టూడియోలలో గొప్పది. స్టూడియోలతోపాటు మద్రాసు నగరము తెలుగుకవులను పలువురను ఆకర్షించినది. తెలుగుదేశములో డిస్ట్రిబ్యూటర్సు కంపెనీలు చాలకలవు. వీనిలో విజయవాడయందు అధికసంఖ్య.

కుస్తీ మల్లయుద్ధము లందు, విలు విద్యయందు, వివిధ క్రీడల (Sports) యందు ప్రఖ్యాతిగాంచిన ఆంధ్రులు యీ కాలమున కలరుచున్నారు. కోడి రామమూర్తి నాయుడుగారి జన్మస్థానము విజయనగరము.

మల్లయుద్ధ ప్రవీణుడైన యీయనకు భారతదేశ హెర్క్యులెస్ అను బిరుదము. ఈయన ఒక సర్కస్ కంపెనీ నిర్వహించెను. మోటారుకారు నాపుట, రెండు ఏనుగుల బరువును మోయుట యీయన గావించిన బలప్రదర్శనాలు. కలియుగార్జునుడైన అప్పారావు, ద్రోణాచార్యుని వలె విలు విద్య యందు అద్వితీయ ప్రతిభను చూపించెను. విజయనగరం మహారాజు కుమారుడు సర్. విజయ భారతదేశ ప్రజలలో క్రికెట్‌క్రీడలో అభిమానము కలుగజేయుటకు కృషిచేసెను. 1933-34వ సంవత్సరమున యీయన జట్టు ఎం. సి. సి. జట్టును ఓడించినది. 1936లో లండన్ వెళ్ళిన క్రికెట్‌టీమ్‌కు యీయన నాయకుడు. సి. కె. నాయుడు భారత దేశమందలి క్రికెటు యోధులలో అగ్రగణ్యుడైన ఆంధ్రుడు. ఈయనతమ్ముడు సి. యస్. నాయుడు కూడ క్రికెటులో అన్నవలెనే అంతర్జాతీయ ప్రఖ్యాతిగాంచినాడు. కె. యస్. రంగారావు మరియొక క్రికెటువీరుడు. టెన్నిస్‌లో నారుమంచి నారాయణమూర్తి, శ్రీరామస్వామి, యస్. కృష్ణస్వామి మొదలయిన వారు ప్రఖ్యాతిగాంచినారు. ఫుట్‌బాల్ మొదలైన ఆటలలో కూడ ప్రఖ్యాతివహించిన ఆంధ్రులు కలరు. చెడుగుడు ఆంధ్రుల అభిమాన క్రీడ. ఇందులో కొంపల్లి, ఖాదర్‌ఖాన్, ధనంజయు, సుబ్బులు, చెంచయ్య, అవధాని మొదలైనవారు ఆలిండియా పోటీలలో గెలుపొందిరి. యోగాసనములందును, బలప్రదర్శనములందును ప్రఖ్యాతిగాంచిన వారు తెలుగుదేశములో కలరు. క్రీడలను పరిశీలించినపుడు నేడు మనదేశమున దేశీయ క్రీడలకు దేశీయ వ్యాయామములకు ప్రాధాన్యము తగ్గి, విదేశీయ క్రీడలకు ప్రాధాన్యము హెచ్చినదని స్పష్టమగుచున్నది.

ఈ కాలమున ఆంధ్రులు ఇతర రాష్ట్రాలకు వెళ్లిరి. అక్కడ ఆంధ్ర సంస్కృతి వికాసమునకై కృషిచేయుట జరిగినది. బొంబాయి నగరము అనేక యంత్రశాలలకు నిలయమైనందు వలన తెలుగుదేశమున ముఖ్యముగా తెలంగాణ యందు వేలకొద్ది కార్మిక కుటుంబాలు జీవనోపాధి కొరకు వెళ్ళుట జరిగినది. బొంబాయినగరములో తెలుగువారు నివసించు ప్రాం

తముకలదు. బొంబాయి నగరమున తెలుగువారు కొందరు వివిధ రంగాలలో ప్రఖ్యాతిగాంచిరి. ఇక్కడినుండి చాలకాలము క్రింద శంకర్ శాయన్న పర్తా అనువారి సంపాదకత్వమున తెలుగుసమాచార్ పత్రిక కొంతకాలము వెడలి ఆగిపోయినది. ఈనాడు బొంబాయి నగరానికి మేయరుగా నున్న శ్రీ పుప్పాల అను మహాశయుడు ఆంధ్రుడే. మధ్యరాష్ట్రము యొక్క రాజధాని నాగపూరులో కూడ చాలమంది తెలుగువారు కలరు. వారు మధ్య రాష్ట్ర ప్రజాహిత జీవనమున పరిపాలనా రంగమున గొప్పపేరుపొంది కీర్తిగాంచిరి. మాచిరాజు భవాని శంకరనియోగిగారు, నాగపుర విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షులై, హైకోర్టు న్యాయమూర్తులై, పబ్లిక్ సర్వీస్ కమిషన్ అధ్యక్షులై గణుతిగాంచిరి. స్వర్గీయ శ్రీ ఈమ్నగంటి రాఘవేంద్రరావు గారు మధ్యరాష్ట్ర ప్రముఖులలో వన్నెకెక్కి ఆ రాష్ట్రమున కొంతకాలము గవర్నరుగా పనిచేసిరి. నాగపురమున ఆంధ్ర గ్రంథాలయము పాఠశాలలు కలవు. ఈ గ్రంథాలయమున ఆంధ్ర సాంస్కృతిక కార్యకలాపాలు జరుగుచుండును. సంయుక్త రాష్ట్రములో ప్రముఖపత్రికా రచయితగా, మితవాద నాయకుడుగా, అఖిలభారత ప్రశస్తిగాంచిన స్వర్గీయ చిఱ్ఱాపూరి యజ్ఞేశ్వర చింతామణిగారు సంయుక్త రాష్ట్ర ప్రజాహిత జీవనముతో గాఢమైన సంబంధముకలిగి, కొంతకాలము మంత్రిగా కూడ పనిచేసిరి. ఢిల్లీ నగరములో ఆంధ్రసమితి చక్కగా పనిచేయుచున్నది. కలకత్తా, ఖరగ్‌పూర్ మొదలయిన నగరాలలో కూడ ఆంధ్రసంస్థలు పనిచేయుచున్నవి. ఈవిధముగా రాష్ట్రేతర ప్రాంతాలలో ఆంధ్రసంస్కృతితో పాటు ఆంధ్రులు ప్రకాశించిరి. అన్యరాష్ట్రాలకు వెళ్ళుటకు ఆంధ్రులు సంకోచించలేదు. అక్కడవారు మడికట్టుకొని కూర్చుండలేదు. వివిధరాష్ట్రాలలో వారు చక్కగా రాణించినారు. బర్మా, మలయా, మొదలైన ఆసియా దేశాలకు ఆంధ్రులు వెళ్ళిరి.

వంగరాష్ట్రమున హృదయశక్తి ప్రధానము. తమిళదేశమున మేధాశక్తి ముఖ్యము. తెలుగుదేశమున హృదయశక్తి, మేధాశక్తి సమానముగా

కన్పడుచున్నది. ఈ కాలమున ఆంధ్రదేశమందు మేధావులు, విజ్ఞానులు, దిగ్దంతుల వంటివారు ఉద్భవించిరి. భారత ప్రభుత్వముచే భారత రత్న భూషితులైన మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు, ప్రపంచప్రఖ్యాతి గాంచిన ఇంజనీరు, ఆధునిక మైసూరు నిర్మాత ఆయన. హైద్రాబాదు నగరమును మూసీ వరదలనుండి రక్షించిన ప్రతిభావంతుడు. మనదేశ ఆర్థిక పారిశ్రామిక సమస్యలనుగూర్చి అధికార పూర్వకముగా అభిప్రాయ మీయగలిగిన శేముషీ సింధువు ఆయన. నేడు భారత రిపబ్లిక్ ఉపాధ్యక్షుడైన, సకల ప్రపంచానికి సుపరిచితుడైన వేదాంత వేత్త, విజ్ఞాని, గ్రంధకర్త, రాజనీతి కోవిదుడయిన ఆచార్య రాధాకృష్ణ మరొక భారతరత్నము. నవభారత రాజ్యాంగ రచనలో ముఖ్యుడు. న్యాయశాస్త్ర కోవిదుడై విలసిల్లి కీర్తిశేషులైన అల్లాడి కృష్ణస్వామి అయ్యగారు ఆధునిక, భారత మేధావులలో చెప్పదగినవారు. కీ. శే. చింతామణిని గూర్చి ఇదివరకే ప్రస్తావించినాము. చింతామణి వలెనే మితవాద నాయకుడై, భారతదేశ ఆర్థిక సమస్యలను కరతలామలకము గావించుకొనిన కీ. శే. మోచర్ల రామచంద్రరావు పంతులు ఆధునిక భారత మేధావులలో పేర్కొనదగినవారు. వీరిని దక్షిణదేశ గోఖలే అని పిలిచెడివారు. స్వర్గీయ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఈ శతాబ్దమునందలి భారతీయులలో సర్వతోముఖ ప్రతిభావంతులయిన విద్యావేత్త- సూత్రకారుడయిన గాంధీమహాత్మునికి భాష్యకారుడని ప్రసిద్ధిగాంచిన భారత జాతీయ చరిత్రకారుడు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు- భారతదేశ నాయకులలో అగ్రశ్రేణి నలంకరించుచున్న మేధావి. దక్షిణదేశములో ఆయుర్వేదవైద్య ప్రచారము గావించిన కీర్తి పండిత, డి. గోపాలాచార్యులు, ఆచంట లక్ష్మీపతిగార్లకు చెందుచున్నది. వీరు ఉభయులు ఆయుర్వేదమును గూర్చి మంచిగ్రంథాలువ్రాసి ప్రకటించిన విజ్ఞానులు. ఒక ఆయుర్వేద కళాశాలను కూడ స్థాపించిరి. కీ. శే. తాతా సుబ్బారాయశాస్త్రిగారు ధర్మశాస్త్రము, వ్యాకరణము, అలంకారము మొదలైన వానిపై అధికారము గలిగి ప్రామాణికులయిన పండితులై సకల భారతదేశమున సంస్కృతభాషా పండితుల

లో దేదీప్యమానముగా ప్రకాశించిరి. స్వర్గీయ శ్రీబెల్లంకొండరామారావుగారు అద్వైత మతసిద్ధాంతములను సమర్థించి అపర శంకరాచార్యులై భాసించిరి. ఇది విజ్ఞానయుగము, సైన్సుయుగము, అణుశక్తి యుగము. ఆధునిక విజ్ఞానరంగమున ఈ కాలమున భారతదేశము కొంత ముందడుగు వేసినది. నేటి ప్రపంచములో విజ్ఞాన పరిశోధకులలో ఎన్నికగన్న భారతీయులు చంద్రశేఖర వెంకటరామన్- ప్రపంచ విజ్ఞానమున భారతదేశము యొక్క దోహదము ఏమాత్రమయిన నున్నదనినచో దానికి ముఖ్యకారణము రామన్ పరిశోధనలే. రామన్‌గారు కొంతకాలము ఆంధ్ర విశ్వవిద్యాలయమును అలంకరించిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయములో సైన్సురంగములో నూతన పరిశోధనా కృషి కొంతజరిగినది. ఇట్టి పరిశోధకులలో ముఖ్యులై, రామన్ ముఖ్యశిష్యుడు డాక్టరు సూరిభగవంతంగారు- యీయన సహకారమే లేకపోయినచో ఆ పరిశోధన యీ విధముగా ఫలించెడిది కాదని రామన్ మహాశయునిచే మెప్పునొందెను. ప్రపంచ విజ్ఞాన రంగమునకు దోహదము చేసిన ఆంధ్రవైజ్ఞానికులలో ప్రముఖుడు. డాక్టర్ యెల్లాప్రగడ సుబ్బారావుగారు తూర్పుగోదావరి జిల్లా వాస్తవ్యులు.అమెరికావెళ్లిరోగాల నిర్మూలన విషయములో గొప్పపరిశోధనలుచేసి హార్వర్డు విశ్వవిద్యాలయమున అధ్యాపకుడుగా నుండి ప్రఖ్యాతికెక్కిరి. వీరు భయంకరమైనవ్యాధులకు మంచి ఔషధములు కనిపెట్టిరి. ఈయన 1948లో కీర్తిశేషులయిన ఆంధ్రమేధావి. తెలుగు దేశమున యీకాలమున వివిధ విజ్ఞానరంగాలలోనే కాక పరిపాలనా రంగమునందుకూడ అగ్రశ్రేణిని అలంకరించిన వారు కలరు- ఐ. సి. ఎస్. పరీక్షలో ఉత్తీర్ణులై, ఉన్నతోద్యోగాలను ఎన్నిటినో నిర్వహించి, మద్రాసుప్రభుత్వమునకు ప్రధాన కార్యదర్శియై, బొంబాయి రాష్ట్రమునకు గవర్నరై యీనాడు భారతప్రభుత్వ ప్లానింగు కమీషనుకు సలహాదారుడుగా నున్న శొంఠి వెంకటరామమూర్తి పంతులుగారు భారత సివిలియనులలో గొప్పవిజ్ఞాని, మేధావి, గణితశాస్త్ర ప్రవీణులు-మద్రాసు హైకోర్టు న్యాయమూర్తిగా పనిచేసిన వేపా రామేశం పంతులుగారు నేటి ఆం

ధ్రమేధావులలో నొకరు; ఆంధ్రమహాసభకు అధ్యక్షులై, ఆంధ్రరాష్ట్రము కావలెనని ఉద్ఘాటించిన బయ్యా నరసింహేశ్వర శర్మగారు వైస్‌రాయి మంత్రిమండలిలో ప్రవేశించిన మొట్టమొదటి ఆంధ్రుడు- మద్రాసుగవర్నరుగా పనిచేసిన కె.వి. రెడ్డి నాయుడు గారిని యీ సందర్భమున పేర్కొనవలసి యున్నది. స్వరాష్ట్రమునందేకాక అన్యరాష్ట్రాలకు గూడావెళ్ళి, స్వభాష యందేకాక ఆంగ్లభాషయందును పత్రికలను నిర్వహించి, ఆంగ్లభాషలో మంచి రచయితలుగా పేరుపొందిన ఆంధ్రులు యీ కాలమున గలరు. వీరిలో శ్రీ కోటంరాజు పున్నయ్య, కోటంరాజు రామారావు, కుందూరి ఈశ్వరదత్తు ప్రజ్ఞానిధిఎం, వి. చలపతిరావు, ఖాసా సుబ్బారావు మొదలైన వారిని పేర్కొనవలసి యున్నది. భారత నావికాదళమునకు ముఖ్య నాయకులు గానున్న శ్రీ కటారి, భారత సైన్యమునకు ముఖ్యనాయకుడు గానున్న శ్రీనగేశ్ గార్లు ఆంధ్రులగుట గమనించదగిన విశేషము. ఈ విధముగా ఆంధ్రప్రతిభ, ఆంధ్రమేధస్సు వివిధ రంగాలలో రాణించి భారత జాతీయ వికాసమునకు దోహదము కలిగించి, ఆంధ్ర సాంస్కృతిక దీపమును దేదీప్యమానముగా సకల భారతమునందు ప్రకాశింప జేసినది. జాతీయోద్యమ రంగమునందు మరియు స్వాతంత్ర్య సంపాదన కృషిలో ఆంధ్రులు ముందంజ వేసిరి. భారతదేశము నందలి కమ్యూనిస్టుపార్టీ మేధస్సుకూడ ఆంధ్ర తేజము నుండియే లభించినది.

ఆంధ్రదేశములో సాంస్కృతిక పునరుజ్జీవనము యీ విధముగా జరుగుచుండగా తెలంగాణములో పరిస్థితులు మరొక విధముగా నుండెను. మూడు కోట్ల ఆంధ్రులలో తెలంగాణము ఒక కోటి ఆంధ్రులకు నివాసము. వైశాల్యముదృష్ట్యా కూడ ఇది ఆంధ్రదేశములో మూడవ వంతని చెప్పవచ్చును. గడచిన 150 సంవత్సరాలలో హైదాబాదుపై పోలీసుచర్య జరిగినప్పటి వరకు తెలంగాణము ఆంధ్రదేశముతో విడిగా నుండవలసివచ్చెను. ఇందుచేత యీ రెండుప్రాంతాల పరిస్థితులలో రాజకీయ విభేదము వలన కొంత భిన్నత్వము ఏర్పడినది. సాంస్కృతి.

కముగా, అర్థికముగా యీ ఉభయ ప్రాంతాలు అవిభాజ్యములు. కృష్ణా, గోదావరీ నదులు యీ రెండుప్రాంతాల ఐక్యమును నిరూపించుచున్నవి. తెలంగాణములో అడవులు, గనులు, చెరువులు మొదలైన ప్రకృతి సంపద కలదు. ఇందుచేత అర్థికముగా, పారిశ్రామికముగా ఆంధ్రదేశము, తెలంగాణము రెండు విడివిడిగా నుండుటకు వీలులేదు. భిన్న పరిపాలనలు యీరెండింటిని కొంతకాలము విడివిడిగా నుంచినవి. సత్వర భవిష్యత్తులో యీ రెండింటి సమైక్యత సాధింపబడగలదని ఆశింపవచ్చును. హైద్రాబాదు పరిపాలకులు ఇంగ్లీషువారికి సామంతులైనప్పటికిని రాజధాని నగరమైన హైద్రాబాదు పట్టణమును విడిచిపెట్టినచో ఆంగ్ల నాగరికతయొక్క ప్రభావము తెలంగాణముమీద ఎక్కువగా పడలేదని చెప్పవచ్చును. మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాలతో తెలంగాణము యీ నూటయేబది సంవత్సరాల నుండి ఒక రాష్ట్రముగా నున్నది. కొన్ని సరిహద్దు ప్రాంతాలలో, కొంతవరకు హైద్రాబాదు నగరములో అదికూడ విద్యాధిక కుటుంబాలయందు తప్ప తెలుగువారికి మహారాష్ట్ర, కర్ణాటకులకు గాఢమైన సంబంధబాంధవ్యాలు కుదురలేదు. సాంస్కృతికముగా కూడ మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతాల ప్రభావము యెక్కువగా తెలంగాణముమీద పడలేదు. ముస్లిం నాగరికత ఉర్దూభాషా ప్రభావము యీ కాలమున తెలంగాణముమీద యెక్కువగా కన్పడుచున్నది. ఉన్నత కుటుంబాలలోనేకాక సామాన్య కుటుంబాలలో కూడ పార్సీ, ఉర్దూభాషల బోధన జరుగుచుండెను. వేషములో కూడ ముస్లిం నాగరికతా ప్రభావము బాగుగా పడినది. పరదా పద్ధతి, ఉన్నత కుటుంబాలలోనేకాక మధ్యతరగతి కుటుంబాలలో కూడ బాగుగా వ్యాపించినది. ఇతర సందర్భాల నటుంచి నప్పటికిని వివాహాది శుభకార్యాలలో కూడ పదిమంది యొకచోట కూర్చున్నప్పుడు బంధువులు, స్నేహితులు, తుదకు అన్నదమ్ములు కూడ ఉర్దూభాషలో మాట్లాడుట మర్యాదగా పాటింపబడినది. గ్రామాధికారులైన పటేలు, పట్వారీల పత్రవ్యవహారాల మీద ఉర్దూభాష యొక్క ప్రభావము ప్రస్ఫుటమైనది. తత్ఫా

శీలు కచేరీనుండి ఉన్నత న్యాయస్థానమువరకు పరిపాలనా వ్యవహారభాష ఉర్దూ యైనది. ప్రభుత్వ పాఠశాలలలో కూడ ఉర్దూభాష బోధనా భాష యైనది. ఇందుచేత ఆంధ్ర మహాశయులకు అక్షరాభ్యాసము తోడనే అరబ్బీ, ఫార్సీ, ఉర్దూలను ఆరంభింపవలసిన అవసరము యేర్పడెను. ఇంగ్లీషు పరిపాలనయందు వలెకాక ఇక్కడ ప్రాథమిక స్వత్వములు పరిపూర్ణముగా లోపించెను. ప్రభుత్వ అనుమతి లేనిది పాఠశాలగాని, గ్రంథాలయముగాని స్థాపించరాని పరిస్థితి యేర్పడెను. విశ్వప్రయత్నము గావించినను లభించు అవకాశ మసాధ్యమయ్యెడిది. సంస్కృతాంధ్రములను స్మరించువారి సంఖ్య క్షీణించెను. ఈ విధమైన పరిస్థితుల ఫలితము వలన హైద్రాబాదు ఆంధ్రుల స్థితిగతులు 1920 వ ప్రాంతమున యీ విధముగా నుండెనని ఆంధ్రోద్యమ చరిత్రకారులైన ఆంధ్ర పితామహ, పద్మవిభూషణ బిరుదాంకితులైన మాడపాటి హనుమంతరావు పంతులు గారిట్లు వర్ణించినారు. "....తెలుగువాడు రాజ్యాంగము నందు ఏ మాత్రము గొప్ప స్థితికి వచ్చినట్లు కానరాదు. కొన్ని సంవత్సరాల క్రింద హైకోర్టు జడ్జి పదవిని ఆకస్మికముగా పొందిన ఒక నాయుడు గారిని వదలి వేసితిమేని హైకోర్టు జడ్జి పదవికి వచ్చిన తెలుగువాడు లేనేలేడు. వైద్యశాఖ యందిపుడు పనిచేయుచున్న ఒకరిద్దరిని లెక్కలోనికి తీసుకొనని పక్షమున ఉన్నతోద్యోగములందున్న తెలుగువారు లేనేలేరని నిస్సంశయముగా చెప్పవచ్చును. 1895 లో హైద్రాబాదునందు శాసన నిర్మాణ సభ యొకటి స్థాపించబడినది. అప్పటి నుండి నేటివరకు ఒక ఆంధ్రుడేనియు దానిలో సభ్యుడగు భాగ్యము పొందలేదు. పలువురు హిందువులీ రాజ్యమున అవ్వల్ తాలూకదార్లుగను, సుబేదార్లుగను పనిచేసిరి. కాని ఆంధ్రుడెవ్వడును అట్టి గౌరవమునకు పాత్రుడు కాలేదు. నూరురూపాయలకు మించిన నెలజీతము తీసుకొనువారిని వ్రేళ్ళపైన మనము లెక్కింపవచ్చును. హైద్రాబాదు హైకోర్టులో ప్రముఖులుగా పనిచేయుచున్న న్యాయవాదులలో ఆంధ్రుడెవడైన యున్నాడా యని సంశయింపవలసివచ్చు న్నది...మహా

రాష్ట్రీయులు వర్తకాభివృద్ధి సాధనములకు పంటలను పండించుచున్నారు. ...కాని తెనుగు రైతు ఇంకను భోజనమున కవసరములగు పంటలను పండించుటతోనే తృప్తిపొందుచున్నాడు. రాజ్యమునగల కర్మాగారములలో 65 మాత్రమే తెలుగు ప్రాంతముననున్నవి. వీనిలో 10 హైదరాబాదు పట్టణములోనివే. కర్మశాలల యజమానులు సాధారణముగ పారసీలో తురకలో అయి వుందురు....చర్మపు పనులలోను, నేత పనులలోను ముందంజ వేయువారు సాధారణముగా తురకలే...నాగరికత గలదిగా నెంచబడు హైద్రాబాదు పట్టణమున నైతము పంచలకొలది మహారాష్ట్ర బ్రాహ్మణులు వర్తక వ్యాపారము సమర్థతతో నిర్వహించుచుండ,...తెలుగు బ్రాహ్మణుడు వర్తకము తనకు అవమానకరమగు వృత్తియని ఇంకను భావించుచునే యున్నాడు. ఎనిమిది జిల్లాల వైశాల్యముగల యీ తెలుగు దేశమందు, రాజధాని నగరమందైనను, ఒక బ్రహ్మసమాజముగాని, ప్రార్థన సమాజముగాని లేదు. హైద్రాబాదు నందొకటియు, ఓరంగల్లు నందొకటియు మొత్తము రెండు ఆర్యసమాజములు కలవు. కాని అవి చేయుపని మిక్కిలి అల్పము. ఆపని యైనను పట్టణము దాటి అవలికి బోయినట్లు తోచదు. సంఘమత సంస్కారోద్యమములు ఇంకను ఇచ్చటి వారి కన్నులను విప్పలేదు...ఈ రాష్ట్రమున చదువుకొనిన వారి సంఖ్య వేయింటికి 28 మందికంటె మించలేదు...తెలుగుదేశమున మాధ్యమిక పాఠశాలల సంఖ్య 18....హైద్రాబాదులోని కళాశాలలయందు నేటివరకును ఎఫ్.ఏ, బి.ఏ పరీక్షలలో గడతేరిన వారిలో తెలుగువారి సంఖ్య అత్యల్పము. ....పారిశ్రామిక విద్యాలయములందును తెలుగువారు సామాన్యముగా గానరారు...బ్రిటిష్ హిందూదేశములో లేని చిక్కొకటి ఈ రాజ్యమువారి నెదుర్కొనుచున్నది. అదేదన అచ్చట ఇంగ్లీషు దానితో దేశభాష, ఈరెండే కావలసి యున్నవి. ఇచ్చట ఆరెంటితోబాటు ఉర్దూ కూడ వచ్చిననే గాని పని సాగదు...ఆరంభ విద్య తెలుగున నేర్పు పాఠశాలలు చాల గ్రామములలో నున్నవి. కాని అంతమాత్రాన జనులకు లభించు జ్ఞానము శూన్యము. మాధ్యమిక పాఠశాలలలో తెలుగు రెండవ భాషగా మాత్రము

చదువ వీలున్నది. హైద్రాబాదు కళాశాలలో తెలుగు బోధించు యేర్పాటులు కలవు. కాని దానివలన లాభము తక్కువ...ఈ రాజ్యము వారు ఉర్దూనో, ఫార్సీనో రెంతవ భాషగా తీసికొన గోరుచుందురు. మాధ్యమిక విద్యా పరీక్షలలో తెలుగు రెంతవ భాషగా తీసికొనువారి సంఖ్య దినదినము సన్నగిల్లుచున్నది. ప్రాత పద్ధతిని సంస్కృతము నందును, ఆంధ్రము నందును కొంత పాండిత్యము కలవారు కొందరు అక్కడక్కడ ముఖ్యముగా వరంగల్లు, కరీంనగరము, నల్లగొండ జిల్లాలలో నున్నారు. కాని వారు ఏ మూలనో కూర్చుండి యక్షగానములనో, హరికథలనో, శతకములనో వ్రాసికొని బ్రతుకవలసిన వారై యున్నారు...ఈ రాజ్యములోని తెలుగు భాషకు, ఉత్తరమునను కొంతవరకు పశ్చిమమున మహారాష్ట్ర భాషతోను, కొంత పశ్చిమమునను, దక్షిణమునను కన్నడ భాషతోను సమ్మేళనము కలుగు చున్నది. తక్కిన యన్ని భాగములలోను, అందు ముఖ్యముగా పట్టణములందు ఉర్దూ భాషా సంపర్కము పడజాలనిదై యున్నది. ఈ కారణము వలన పైన జెప్పిన ప్రాంతముల వారి ఆచారములందు వలెనే, వారి భాషయందు కూడ ఎన్నియో మార్పులు వాటిల్లినవి. అదిలాబాదు, నిజామాబాదు ప్రాంతములందు వసించువారు సంభాషించు నప్పుడు మహారాష్ట్ర భాషలోని శబ్దములును వాని యపభ్రంశ స్వరూపములును తరుచుగా వచ్చుచున్నవి....మహబూబు నగరపు తుది భాగములోను, అత్రాపుబల్దా యొక్క పశ్చిమ భాగములోను నివసించు వారి భాష కర్ణాటక సంపర్కము వలన కన్నడభాషా శబ్దములతో నిండి యుండును...ఇక ఉర్దూ తోటి కలయిక వలన తెలుగు భాషకు కలిగిన దురవస్థ ఇట్టిదని చెప్పుట కష్టము. ఇది 1922 ప్రాంతమున హైద్రాబాదులోని తెలుగువారియొక్క సంస్కృతిని చక్కగా చిత్రించుచున్నది. కీ.శే. సురవరం ప్రతాపరెడ్డి గారి ఆంధ్రుల సాంఘిక చరిత్రలోని "...ముసల్మాను ప్రభువులలో, గోలకొంక సుల్తానులలో ఒక్క ఇబ్రాహిం కుతుబ్షాహియు, అతని యుద్యోగి

యగు అమీను ఖాసున్ను తెలుగు భాషను పోషించిరి. అనఫ్జాహివంశము వారు తెలుగు నాదరించకపోగా దాని విఘాతముతే కల్పించిన వారైరి. తెలుగుదేశాన్ని పాలించిన యీ కుతుబ్షా, అనఫ్జా వంశాలవల్ల తెలుగుభాష కేమిన్నీ సహాయము కలుగలేదు. ఇంగ్లీషు పరిపాలనలో ఇంగ్లీషు ప్రభుత్వము దేశములోని తాటాకు గ్రంథాలను సేకరించి మద్రాసులోని ప్రాచ్య లిఖిత పుస్తకాలయమును స్థాపించి అందు వాటినుండి అంతరించి పోనున్న బహుగ్రంథాలను రక్షించిరి. పలువురు ఇంగ్లీషు వారు మన భాషను నేర్చుకొనిరి. అందు బ్రౌన్ ముఖ్యుడు. కుతుబ్షాహీలను, అనఫ్జాహీలను అందరిని ఒక ప్రక్కబెట్టి, బ్రౌన్ దొర నొకదిక్కునపెట్టి తూచిన బ్రౌన్ దిక్కే త్రాసు ముల్లు చూపును.” అని తెలిపినారు. ఈ పరిస్థితులు తెలంగాణములోని ప్రత్యేక స్థితిని సూచించుచున్నవి.

బ్రిటిష్ ఆంధ్రములో సంస్కృతి పునరుజ్జీవనానికి దొరికిన అవకాశాలు తెలంగాణములో బొత్తిగా లేకుండెను. హైద్రాబాదు ప్రజల హృదయాలలో దేశ స్వాతంత్ర్యబీజాలు 1857వ ప్రాంతమునందే అంకురించి యుండెనని భారత స్వతంత్ర్యోద్యమ రచనకై సేకరింపబడుచున్న వివరాల వలన అవగత మగుచున్నది. అందుచేతనే కాబోలు, అనఫ్జాహీ ప్రభుత్వము ప్రాథమిక స్వత్వాలను హైద్రాబాదు ప్రజలకు సంపూర్ణముగా నిరాకరించినది. ఇంగ్లీషువారు ఇండియాలో ఏమి చేసినప్పటికిని విద్యావ్యాప్తికై జరిగిన కృషిని నిరోధించలేదు. సారస్వత సభలకు బ్రిటిషు ప్రభుత్వము ప్రతిబంధకములను కల్పించలేదు. బ్రిటిషు ఇండియాలో రాజకీయాలతో సంబంధములేని సారస్వత కృషి జరుగుటకు కావలసినంత యవకాశము దొరికినది. అందుచేత కేవల సారస్వతోపాసకులైన వారి కృషి నిరంతరాయముగా జరిగినదనియే చెప్పవలయును. అధునికాంధ్రవాఙ్మయ నిర్మాతలైన వీరేశలింగం ప్రభృతుల జీవితాలు ఇందుకు నిదర్శనములు. సర్కారు జిల్లాలలో సారస్వత సేవకు తమ జీవితాలను అంకితము జేసిన మహాశయులలో అత్యధికసంఖ్యాకులు

రాజకీయాలతో ప్రమేయము కలిగించుకోలేమ. అందువలన అచ్చట రాజకీయ కార్యకర్తలు సారస్వతోపాసకులు విడివిడిగా కృషిజేయుట జరిగినది. కాని తెలంగాణములో ఇది సాధ్యముగాని, సంభవముగాని కాలేదు. ఇక్కడి ప్రజల మాతృభాషను అణచివేయుటయే అప్పటి ప్రభుత్వము యొక్క ముఖ్యోద్దేశమై యుండెను. కేవల సారస్వతోద్యమమును, అనుమాటకు అవకాశములేని పరిస్థితులను ఇక్కడి ప్రభుత్వము కలిగించినది. గ్రంథాలయాల స్థాపనయే బహు దుష్కర కార్యముగా నుండెను. వీని నిర్వహణ బాధ్యతను వహించిన కార్యకర్తలు ఎన్నియో యిబ్బందులకు గురిచేయబడిరి. సారస్వత సమావేశాలపైన గూడ అనేక విధాలైన నిర్బంధాలు ప్రయోగింపబడియుండెను. ప్రజల మాతృభాషల వ్యాప్తికి ఏ కొంచెము అవకాశమిచ్చినప్పటికిని అందువల్ల స్వతంత్ర భావాలు వ్యాప్తిజెంది రాజకీయముగా తమ కొంప మునిగిపోవునను దృఢనిశ్చయముతో కవి సమ్మేళనాలు, సారస్వత సభలయెడ గూడ ఇక్కడి ప్రభుత్వము నిర్బంధ విధానము ననుసరించినది. ఏ చిన్న సమావేశము చేయదలచినప్పటికిని ప్రభుత్వముయొక్క అనుమతి అవసరమై యుండెను. ఈ అనుమతి మిక్కిలి దుర్లభమై యుండెను. ఈ వాగ్బంధన శాసనముయొక్క పైశాచిక తాండవము వలన రాజకీయ కార్యకర్తలు సారస్వతోపాసకులు విడివిడి వర్గాలుగానైన చీలిపోయి పనిచేయు నవకాశమైనను దొరకలేదిక్కడ. సమావేశ స్వాతంత్ర్యము వాక్స్వాతంత్ర్యము రచనాస్వాతంత్ర్యము హైదరాబాదీయు లందరియొక్క ముఖ్యాశయమై యుండెను. ఈ యాశయముకొరకై ప్రతివారును కృషి చేయుచుండిరి ఈ కృషి ప్రభావము సారస్వత రంగమున గూడ ప్రత్యక్షమగుచున్నది.

హైదరాబాదులోని ఊరూర సంస్కృతాంధ్ర పండితులున్నప్పటికి వారు పరస్పరము సమావేశమై బాహ్యప్రపంచముతో సంబంధము కలిగించుకొను నవకాశము లేకుండెను. మదరాసు విశ్వవిద్యాలయమున ప్రాంతీయభాషలకు స్థానమీయబడినందు వలన బ్రిటిషు ఇండియాలోని

ఆంగ్ల విద్యాధికులకు తమ మాతృభాషలతో పరిచయ మేర్పడియుండెను. హైదరాబాదు రాష్ట్రమున రాజభాష ఉరుదూ; విద్యావిధాన మంతయు ప్రాథమిక తరగతుల నుండి విశ్వవిద్యాలయ తరగతుల వరకు ఉరుదూ ద్వారా జరుపుచు, యే యితర రాష్ట్రములలో లేని క్రొత్త విద్యాపద్ధతి హైదరాబాదు ప్రజల నెత్తినిమీద రుద్దబడినది. ఉద్యోగములు మొదలైన ప్రభుత్వ కరుణాకటాక్షములు గూడ నూటికి తొమ్మిదిమంది లేని అల్పసంఖ్యాకులమీదనే ప్రసరించినందు వలన ఉరుదూ ద్వారా నైనను ఉన్నత విద్య నభ్యసించ వలెనను అపేక్ష ప్రజలలో కలుగలేదు. ఇందుకుతోడు ప్రజాసామాన్యముయొక్క ఆర్థిక దారిద్ర్యమును వృద్ధి చేసినది. ఈ విధముగా సమస్త భారత మహాసముద్రములో హైదరాబాదు రాష్ట్ర మొక ప్రత్యేక ద్వీపముగా సిద్ధమై అందు నివసించు ప్రజలను నాగరక ప్రపంచము నుండి వేరు చేసినది. తత్ఫలితముగా గత శతాబ్దాంతము నుండి ఈ శతాబ్దాంతము వరకు హైదరాబాదులోని కొద్దిమంది విద్యావంతులలో రెండు ప్రస్ఫుటమైన వర్గాలేర్పడి యుండెను. పల్లెటూళ్ళలో గ్రాసవాసోదైన్యమునకు గురియై కృశించుచుండిన సంస్కృత పండితులు ఆంధ్ర కవులు మొదటి వర్గము. ప్రభుత్వ వ్యవహారాల కొరకు కొలదియో గొప్పయో ఉరుదూ భాషాప్రావీణ్యము, దానికితోడు పార్సీభాషా పరిచయమును అలవరచుకొన్న లౌకికులు రెండవ వర్గము.

ఈ సందర్భమున ఇంకొక ముఖ్య విషయము గూడ గమనించ వలెను. ఆంగ్లభాష ఒక మహాసముద్రము వంటిది. ప్రపంచ విజ్ఞాన భాండారమునకు ప్రవేశము కలుగజేయు తాళముచెవి ఆంగ్లభాష. పాఠకుల నుత్తేజితులనుజేయు సామర్థ్యము ఆంగ్లభాషకు కలదు. కాని ఉరుదూ భాష ఇట్టిది కాదు. ఉరుదూ వయఃపరిమాణము మూడు నుండి నాలుగు వందల సంవత్సరాలకు మించియుండదు. ఉరుదూ కవిత్వము గోలకొండ, బిజాపూర్ రాజధానులందు పదహారవ శతాబ్దము

యొక్క చివరను, పదిహేడవ శతాబ్దియొక్క ఆది యందును ప్రారంభమైనది. ఉరుదూ సారస్వతమునకు శృంగార కవిత్వము, ప్రబంధ పోకడలు, సూఫీ తత్వ ప్రతిపాదితమైన సాహిత్యము ప్రధాన లక్షణములు. కావున ఈ ఉరుదూ సారస్వతమునకు పఠితలను ఆంగ్లభాష వలె ఉత్తేజితులను జేసి విజ్ఞానం ప్రసాదించు సామర్థ్యము లేనందు వలన ఇది చెప్పదగిన గొప్ప పరిణామాలను ప్రాంతీయభాషలతో కలుగ జేయలేకపోయినది. హైద్రాబాదు రాష్ట్రములోని తెలుగుసీమవంక తమ దృష్టిని సారించి ఆధునిక యుగమున ఇక్కడి సారస్వతోద్యమము నకు నిజమైన పునాదులు వేసినవారు స్వర్గీయ శ్రీ కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు. శ్రీ వేంకట లక్ష్మణరావుగారు మహారాష్ట్ర దేశము తోను, భాషతోను గాఢమైన సంబంధము పరిచయము కలిగిన విద్వ న్మణులు. చరిత్ర పరిశోధన విజ్ఞాన ప్రచారము వారి ఆశయాలై యుండెను. ఈ ప్రత్యేక ఆశయాలు కలిగిన లక్ష్మణరావుగారు తెలంగాణ క్షేత్రములో నాటిన సాహిత్య వృక్షము దానికి అనుగుణమైన ఫలములనే లభింపచేసినది. ఈ శతాబ్దారంభమున వారు హైద్రాబాదు రాష్ట్రము నందు గ్రంథాలయోద్యమ రూపమున భాషాప్రచారము ప్రారంభించిరి. హైద్రాబాదులోని శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం 1901, హనుమకొండలోని రాజరాజనరేంద్ర భాషానిలయము, 1904, ల స్థాపనకు లక్ష్మణరావుగారి కృషి ప్రోత్సాహములే ముఖ్య కారణములు. లక్ష్మణరావుగారు తమ విజ్ఞానచంద్రికా గ్రంథమండలిని 1900,వ సంవత్సరమునందే స్థాపించిరి. ఈ గ్రంథమండలి మొదటి నాలుగు ప్రచురణములు హైద్రాబాదు నుండియే వెలువడినవి తరువాత 1908 సంవత్సరమున విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి కార్యా లయమును హైద్రాబాదు నుండి మార్చుట జరిగినది. లక్ష్మణరావుగారు చూపించిన మార్గమున హైద్రాబాదు రాష్ట్రమందు ఆంధ్ర వాఙ్మయరథము నడిపించుటకు నడుము గట్టిన సారధి మాడపాటి హనుమంతరావు పంతులుగారు. ఒక్క వాఙ్మయోద్యమమునకేకాక రాజకీయోద్యమము

మొదలైన ఇతర ఉద్యమాలకు కూడ మార్గదర్శకులు శ్రీ హనుమంతరావు గారే. భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో కొందరి మహనీయుల జీవితాలను పరిశీలించినపుడు మనదేశము పరాధీనదేశము కాకుండినచో, వారు రాజకీయ రంగమున అడుగు బెట్టక, విజ్ఞాన ప్రపంచమునందు మాత్రమే విహరించెడివారని విస్పష్టము కాగలదు. ఇట్టి శ్రేణిలో చేర్చదగిన వారు శ్రీ హనుమంతరావు పంతులుగారు. వీరు హైద్రాబాదు రాష్ట్రమునందుగాక మరొక ప్రాంతమున జన్మించియుండినచో, తమ జీవితమును సాహిత్య వ్యవసాయమునకు, విద్యావ్యాప్తికి పూర్తిగా వినియోగించెడివారు. హైద్రాబాదు రాష్ట్రములోని ప్రత్యేక పరిస్థితులే వారి ప్రజాహిత జీవనమునకు రాజకీయ వాసన కలిగించినవి. హనుమంతరావుగారు ఇంగ్లీషు, ఉరుదూ, ఫార్సీభాషల యందు ప్రవీణులు; లక్ష్మణరాయ సాహచర్యముచే ప్రభావితులు. తెలంగాణ పరిస్థితులను చక్కగా అవగాహన చేసుకొనిన ఆంధ్ర భాషా ప్రియులు. వారు దేశ భాషలపైన ప్రభుత్వమునకుగల సవతితల్లి ప్రేమను గమనించిరి. ఆంధ్రచరిత్ర కుపయుక్తములు కాగల అనేక శాసనములు ఊరూర పడియుండుటను తిలకించిరి. తాటియాకు గ్రంథాలు వేనవేలు జీర్ణించిపోవుట పరికించిరి. నాగరిక జీవిత సౌధమునకు ఉరుదూ భాషయే సింహద్వారముగా భావింప బడుట నవలోకించిరి. పల్లెలలో అజ్ఞాతవాసము చేయుచున్న కవి పండితుల యెడ ఒకమారు తమ దృక్కులను ప్రసరించిరి. ఈ పరిస్థితులలో ఆంధ్ర భాషోద్ధరణకు గ్రంథాలయాలే ముఖ్యసాధనములని గ్రహించి జిల్లాలలో విరివిగా గ్రంథాలయాలను స్థాపించుటద్వారా భాషా ప్రచారమును గావించిరి. కొంతకాలము నుండి నిద్రావస్థలోనున్న ఆంధ్రులను ఈ గ్రంథాలయోద్యమము మేలుకొలిపినది. గ్రంథాలయ సమావేశాలు, వార్షికోత్సవాలు, వాఙ్మయ ప్రదర్శనములు రచయితలలో ఉత్సాహమును పురికొలుపుటకు చక్కగా తోడుపడినవి. యువకులనేకులు సాహిత్య సేవకు కంకణబద్ధులైనారు. తెలంగాణమున గ్రంథాలయోద్యమ వ్యాప్తికి కారణభూతులైన వారిలో కీ.శే. కొమర్రాజు లక్ష్మణరావుగారితోపాటు, కీ.శే. రావి

చెట్టు రంగారావుగారు మరియు రాజా నాయని వేంకట రంగారావు గార్లను పేర్కొనవలసియున్నది, గ్రంథాలయాలు పుస్తకాలద్వారా, పత్రికలద్వారా తెలంగాణమున మంచి ప్రబోధము గావించినవి. ఈ కాలమున హైద్రాబాదు నగరమున కీ.శే. ఆదిపూడి సోమనాథరావుగారు. కీ.శే. మైలవరపు నరసింహశాస్త్రిగారు నివసించుచుండిరి. వీరు ఉభయులు సంస్కృతాంధ్రములందు అభిమానము కలవారు. కృష్ణదేవరాయ గ్రంథాలయ వార్షికోత్సవ సభలందును, హైద్రాబాదు నగరమున ఆకాలమునందు జరిగిన సారస్వత సభలందును, యీ ఉభయుల ఉపన్యాసాలు, పద్యాలు అనేకులను ఉత్తేజితులను గావించినవి. హైద్రాబాదు రాష్ట్రము నందలి తెలుగు సభలలో పాల్గొని ఉపన్యాసాలను ఇచ్చి, పత్రికలకు వ్రాసి, పద్యాలు చదివి ప్రబోధము గావించిన వారిలో శ్రీ దూపాటి వేంకట రమణాచార్యులవారిని ప్రశంసించవలసియున్నది. వారు తెలంగాణము నందలి ప్రతి జిల్లాలోని పల్లెపల్లెకు వెళ్ళి శాసన ప్రతిబింబాలను సేకరించి తాళపత్ర గ్రంథాలను సంపాదించి గొప్పసేవ జేసినారు. నిజాం రాష్ట్రము నందలి సారస్వత సంస్కృతులను గూర్చి వారు వ్రాసిన నిజాంరాష్ట్ర ప్రశంసలోని పద్యాలు ఆరోజులలో అనేక సభలలో పఠింపబడి, సారస్వత సాంస్కృతిక రంగములవైపు యువకులను ఆకర్షించి యుండెను.

గ్రంథాలయోద్యమము తెలంగాణము నందలి జిల్లాలకు వ్యాపించి సాంస్కృతిక పునరుజ్జీవనానికి మంచి దోహదము కలుగజేసినది. కాని ఇంకను పని యెంతో జరుగవలసి యుండెను. నగరమున ఆంధ్రుడు నేనాంధ్రుడనని చెప్పుకోదగిన గౌరవ పరిస్థితి యేర్పడి యుండలేదు. హైద్రాబాదులో ఆంధ్రునికి, ఆంధ్ర సంస్కృతికి గౌరవ స్థానము లేకుండెను. 1921 సంవత్సరమున హైద్రాబాదులో సంఘ సంస్కరణ సమావేశ మొకటి జరిగినది. ఈ సమావేశమునకు సుప్రసిద్ధ మహారాష్ట్ర విద్వాంసులు దేశసేవా పరాయణులైన కర్వే పండితుడు అధ్యక్షుడుగా నుండెను. రెండు రోజులు సభ జరిగినప్పటికిని ఇంగ్లీషు మహారాష్ట్ర భాషలలో తప్ప తెలు-

గులో ఒక ఉపన్యాసమైనను జరుగనందువలన మిక్కిలి విచారించి, అప్పుడు హైద్రాబాదులో న్యాయవాదులుగా నుండిన ఆలంపల్లి వెంకట రామారావుగారు ఒక తీర్మానము తెలుగులో ఉపన్యసించుటకు లేచిరి అప్పుడు సభలో చప్పట్లు చెలరేగి వెంకట రామారావుగారు తమ ఉపన్యాసమును ప్రారంభించకముందే విరమించుకోవలసి వచ్చెను. ఇది ఆ సభలోని ఆంధ్రులకు అవమానము, క్షోభము కలిగించెను. తత్ఫలితముగా అదేరోజు రాత్రి కీ. శే. టేకుమాల రంగారావు హైకోర్టు వకీలుగారి గృహమున ఆంధ్రజనసంఘ స్థాపన జరిగినది. ఈ ఆంధ్రజనసంఘము యొక్క మొదటి సమావేశమున హైద్రాబాదు ఆంధ్రోద్యమ పితామహులు మాడపాటి హనుమంతరావు పంతులుగారు ఈనాటి హైద్రాబాదు ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారు, ఆదిరాజు వీరభద్రరావుగారు మొదలైన పదకొండుమంది పెద్దలు పాల్గొనిరి. తరువాత అతి శీఘ్రముగనే నూరుగురు సభ్యులు యిందులోచేరి, శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారి అధ్యక్షతకింద సమావేశమై చిత్తు నియమావళిని అంగీకరించి, ఒక కార్యనిర్వాహక వర్గమును యెన్నుకొనిరి. దీనికి బారిస్టర్ రాజగోపాలరెడ్డిగారు అధ్యక్షులుగను, మాడపాటి హనుమంతరావు పంతులుగారు కార్యదర్శిగను, 4-1-1922 నాడు ఎన్నుకొనబడిరి.

ఈ ఆంధ్రజన సంఘము యొక్క ఆదర్శాలు ఈ విధముగా నున్నవి.

1. ఈ సంఘమునకు నిజాం రాష్ట్రాంధ్ర జనసంఘమని పేరు.

2. నిజాం రాష్ట్రము నందలి ఆంధ్రులయందు పరస్పర సానుభూతిని కలిగించి వారి అభివృద్ధికై ప్రయత్నించుట ఈ సంఘము యొక్క ఉద్దేశము.

3. ఈ రాజ్యములోని ఆంధ్రులకొరకు, సంఘములను సంస్థలను స్థాపించుట ఉన్నవానికి సహాయము చేయుట ఉపన్యాస సభలను సమావేశ పరచుట మున్నగు కార్యముల వలన పై ఉద్దేశములు నెరవేర్చబడును.

4. ఈ రాజ్యములోని ప్రతి ఆంధ్ర వ్యక్తియు, పదునెనిమిది సంవత్సరములకన్న మించిన వయస్సు కలిగి, చదువను వ్రాయను నేర్చినచో ఈ సంఘమున సభాసదుడు కావచ్చును. ఈ ఆంధ్రజన సంఘము తెలంగాణమున ఆంధ్ర సంస్కృతి వ్యాప్తికై, మంచి కృషి గావించినది. తెలంగాణములోని పల్లెలలో శిథిలమై జీర్ణించుచున్న శాసనాల ప్రతిబింబాలను, తాళపత్ర గ్రంథములను సేకరించుట ఆంధ్రజన సంఘమునకు అనుబంధముగా ఆంధ్ర పరిశోధక మండలి స్థాపితమైనది. ఈ పరిశోధక మండలి లక్ష్మణరావుగారి మరణానంతరము లక్ష్మణరాయ పరిశోధక మండలిగా రూపొందినది. ఆంధ్రజన సంఘము క్రమక్రమముగా వ్యాపించి ఆంధ్రోద్యమము రాజకీయ ఉద్యమముగా అవతరించక తప్పనప్పుడు యీ పరిశోధక మండలి, ఆంధ్ర మహాసభతో అనుబంధము తెంచుకొని స్వతంత్ర సంస్థయైనది. లక్ష్మణరాయ పరిశోధక మండలి తెలంగాణమున మంచి కృషి జేసినది. కొన్ని వందల శాసనాల ప్రతిబింబాలను సేకరించి సురక్షితము గావించినది. ఈ సంస్థ పక్షాన తెలంగాణముసగల శాసనముల సంపుట మొకటి ప్రకటించబడినది. ఇంకను మూడువందల శాసనాల వరకు ప్రకటితము కావలసినవి ఈ పరిశోధక మండలి యందు కలవు. ఈ పరిశోధక మండలి తాళపత్ర గ్రంథాలను చాల సేకరించినది ఈ తాళపత్ర గ్రంథాలు మండలియందు గలవు. ఈ విధముగా ఆంధ్రజన కేంద్రసంఘము పరిశోధనాది కార్యక్రమాలద్వారా సంస్కృతి పునరుజ్జీవనానికి దోహదము గావించినది.

ఈ ఆంధ్రజన కేంద్ర సంఘము స్థాపితమైన సంవత్సరానికి అనగా 1923 సంవత్సరము ఒక ఉపనియమావళి సిద్ధము చేయబడి అందులో జిల్లాల భోను, కేంద్రము నందును ఆంధ్రజన సంఘము నెరవేర్చవలసిన విధులు ఈ విధముగా నిర్ణయింపబడినవి.

'అ' గ్రంథాలయములను స్థాపించుట, పఠన మందిరములను, పాఠశాలలను స్థాపించుట.

'అ' విద్యార్థులకు సహాయము ప్రోత్సాహము చేయుట.
'ఇ' విద్వాంసులను గౌరవించుట.
'ఈ' తాళపత్ర గ్రంథములను శాసనముల ప్రతులను సంపాదించుట, పరిశోధించుట.
'ఉ' కరపత్రముల మూలముననుు లఘుపుస్తక మూలముననుు విజ్ఞానము వ్యాపింప జేయుట.
'ఊ' ఆంధ్రభాషా ప్రచారమునకై వలయు ప్రయత్నములు జరుపుట.
'ఋ' వ్యాయామములను కళలను ప్రోత్సాహ పరచుట.
'ౠ' అనాథలకు వారి కత్యవసరమగు సహాయము చేయుట.

ఆంధ్రజన కేంద్ర సంఘము యొక్క ఆదర్శాలు, ఉపనియమాలు ఆంధ్రజనసంఘ ఉద్యమము సాంస్కృతికోద్యమమని స్పష్టము గావించుచున్నది.

కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారి గ్రంథాలయోద్యమము, వారి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి,1907 సంవత్సరమున హైద్రాబాదులోనే స్థాపితమైనవి. ఈ ఆదర్శాలు ఆంధ్రజన కేంద్ర సంఘము యొక్క ఆదర్శాలతో ప్రతిబింబిత మగుచున్నవి.ఈఆంధ్రజనసంఘ రథసారథియైన మాడపాటి హనుమంతరావు పంతులుగారికి లక్ష్మణరావుగారే మార్గదర్శకులైన మహర్షులు. ఈ ఆంధ్రజన కేంద్ర సంఘము గ్రంథాలయోద్యమ ప్రచారానికి చక్కగా తోడ్పడినది. ఇందుకొరకై గ్రంథాలయ మహాసభలు కూడ కేంద్ర జన సంఘ సమావేశాలతోపాటు జరుగుచుండెను. మొదటి గ్రంథాలయ మహాసభ 22-2-1925 నాడు మధిర, వరంగలు జిల్లాలో, ఆంధ్రజన కేంద్ర సంఘము యొక్క మూడవ సమావేశముతోపాటు జరిగినది. ఈ సభలో గ్రంథాలయోద్యమమును ఎక్కువ విశాల పరచు విధానము నాలోచించి అందుకు కృషి సల్పుటకై ఒక ఉపసంఘము నెలకొల్పబడి యుండెను. రెండవ గ్రంథాలయ మహాసభ కేంద్రజన సంఘము యొక్క నాల్గవ సమావేశముతోపాటు సూర్యాపేటలో 22,23,24 జూలై

1926 లో జరుగుటకు నిర్ణయింపబడెను. కాని ప్రభుత్వ ప్రతిబంధకము వలన సభలు జరుగలేదు. తరువాత 31-5-29, 1-6-29 తేదులలో సభలకు అనుమతి లభించి ఈ సభలు జరిగెను. ఈ సభలో 29 గ్రంథాలయాల ప్రతినిధులు పాల్గొనిరి. తరువాత గ్రంథాలయ సభలు జరుగలేదు. కాని గ్రంథాలయోద్యమము మాత్రము సాగుచునే యున్నది.

ఈ సందర్భమున శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి నాయకత్వమున పనిజేయుచున్న ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారు చేసిన కృషిని ప్రత్యేకముగా స్మరించవలసి యున్నది. కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారి గ్రంథాలయోద్యమము విజ్ఞాన చంద్రికా మండలుల ద్వారా తెలంగాణానికి ఆంధ్రదేశానికి మధ్య దృఢమైన సాంస్కృతిక బంధమును యేర్పరచిరి. తరువాత ఆ సాంస్కృతిక బంధమును బలపరచిన వారిలో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమును ప్రత్యేకముగా చెప్పవలసి యున్నది ఈ ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము వారు తమ వార్షిక సభలలో నాలుగింటిని సూర్యాపేట, క్యాతూరు, ఇల్లెందు, జనగామలలో జరిపి, ఇక్కడ గ్రంథాలయోద్యమానికి మంచి ఊతనిచ్చి కార్యకర్తలను ఉత్తేజితులను జేసిరి.

క్రమక్రమముగా పరిస్థితుల ఒత్తిడి వలన ఆంధ్రోద్యమము రాజకీయోద్యమముగా పరిణమించినది. హైదరాబాదు రాష్ట్రమున మొట్టమొదటి ఆంధ్రమహాసభ జోగిపేటలో 1930 సంవత్సరమున జరిగినది. తరువాత ఆంధ్రమహాసభ ప్రతి సంవత్సరము ఒక సమావేశము జరుపుకొనుచు, ఆరవ మహాసభ 1937 లో నిజామాబాదు నందు జరిగినది. ఈ నిజామాబాదు సమావేశములలో ఆంధ్రోద్యమము రాజకీయోద్యమముగా రూపొందినది. నిజామాబాదు మహాసభలో జరిగిన ఒక ముఖ్యమైన సంఘటన తెలంగాణ సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ దృక్పథములో ప్రత్యేకముగా గమనించవలసి యున్నది. ఆంధ్రమహాసభ వేదిక నుండి తెలుగులో తప్ప ఇతర భాషలలో మాట్లాడరాదని స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డిగారి

నాయకత్వపు యువకులలోన ప్రతిపాదన చేయగా ఆ ప్రతిపాదన ఓడిపోయి నది. రాజకీయోద్యమమునకు మూలమైన తెలంగాణ ఆంధ్రప్రాంతములో నున్న జాతీయ భావములు గాఢముగా కలిగియుండు కూడ ఆంధ్రమహాసభల్లో పాల్గొన జొచ్చిరి. మహారాష్ట్ర, కర్ణాటక సోదరులు ఆంధ్రమహాసభలందు పాల్గొని సమస్యలయందు శ్రద్ధ తీసుకొనుచుండిరి. ఈ పరిస్థితిలో ఆంధ్ర మున తప్ప వేదికనుండి మాట్లాడరాదను నియమము ఆమోదించుట ఆంధ్రమహాసభకు ఆచరణయోగ్యము కాదయ్యెను. అందుచేత యువ కులు, అసంతృప్తులైన యువకులు సాహిత్యాభిరుచి సాంస్కృతిక దృక్ప థముకల యువకులు సురవరం ప్రతాపరెడ్డిగారి నాయకత్వాన తిరుగుబాటు చేసి ఆంధ్రమహాసభలో అభివృద్ధి పక్షమును స్థాపించిరి. ఇందుకు ప్రాతి పదిక సాంస్కృతిక పునరుజ్జీవనాభిలాషయే. అయితే యీ అభివృద్ధి పక్షము తరువాత చేసిన పని చెప్పదగినదిగాలేదు. ఆంధ్రమహాసభ వార్షిక సమావేశాలతోపాటు మహిళా సభలు జరుగుట కూడ సాంప్రదాయముగా నుండెను. తొమ్మిదవ ఆంధ్రమహాసభలో ధర్మవరము, వరంగలు తాలూక 22,23,24 మే 1942 ఆంధ్ర మహిళా సభలు మహాసభలతోపాటు జరిగి నవి. ఈ సారి మహిళాసభ తమ సమావేశాలు ప్రత్యేకముగా జరుగవలె నని తీర్మానించింది. ఈ విధముగా జరిగిన తొమ్మిది ఆంధ్ర మహిళా సభలు తెలంగాణ సోదరీమణులలో మంచి ప్రబోధము, చైతన్యము కలుగ జేసినవి. ఈ మహిళా సభలు స్త్రీల సమస్యలను గూర్చి తీర్మానించుచు సోదరీమణులలో జాగృతి కలిగించినవి. హైదరాబాదులో మధ్యతరగతి కుటుంబాలలో వ్యాపించి యుండిన పరదా పద్ధతి తొలగించి మహిళలు ప్రజాహిత కార్యములలో ముందుకు వచ్చుటకు యీ మహిళా సభలు మంచి కృషిజేసినవి.

హైదరాబాదు నగరమున ఆంధ్ర యువతీ మండలి చిరకాలము నుండి పని జేయుచున్నది. నగరములోని స్త్రీల కొరకై యీ యువతీ మండలి మంచి కృషి జేసినది. ఈ యువతీ మండలి నిర్వాహకలలో

శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి, మాడపాటి మాణిక్యమ్మ, తంగమ్మ ఊబులరెడ్డి, బూర్గుల అనంత లక్ష్మీదేవి, శ్రీమతి టి. వరలక్ష్మమ్మ, నడింపల్లి సుందరమ్మగార్లు ప్రశంసనీయులు. ఏరంభము ఆంధ్ర మహిళా సభలకు అధ్యక్షత వహించిన విదుషీమణులే. ఆనాటి మహిళా సభలు కన్యాశుల్క వరశుల్క, బాల్యవివాహాది సాంఘిక దురాచారాలను నిరసించుచు తీర్మానాలు గావించెను.

ఇంతమించుగా యీ అభివృద్ధినకు స్థాపన కాలముననే హైదాబాదులో సారస్వత ప్రియులైన యువకులు వైతాళిక సమితి యను నొక సంస్థను స్థాపించిరి. సాహిత్యము కళలు వీని వ్యాపనము యీ సంస్థ ముఖ్యోద్దేశము. ఈ ఉద్దేశముతో యీ సంస్థ కొంతపని గావించినది. ఈ కాలముననే మరి రెండు సంస్థలు బయలు దేరినవి. ఒకటి నిజాం కళాశాల విద్యార్థులు కొందరు స్థాపించిన సాధన సమితి. ఈ సాధన సమితి సాంస్కృతిక పునరుజ్జీవన దృక్పథముతో మన రాష్ట్రమున విద్యావంతులైన రచయితలను కూడగట్టుకొని నవ్యసాహిత్య నిర్మాణానికి తోడ్పడినది. ఈ సంస్థ ఇప్పటివరకు యువకుల ఖండకావ్యములు, ఏకాంకికలు, కథానికలు, సారస్వత విమర్శలు కల ముప్పది పుస్తకాలను ప్రకటించి మంచి సేవ జేయుచున్నది. ఈ కాలముననే నల్లగొండ జిల్లా చండూరు ప్రాంతమున సాహితీ మేఖల యను సంస్థ స్థాపితమై ఆ ప్రాంత మందలి అనేక యువకులను ఆకర్షించి సుమారొక డజనుమంది మంచి కవులను సిద్ధము జేసినది. సాహితీ మేఖల కొన్ని ఉత్తమ కావ్యాలను ప్రకటించినది.

ఈ పరిస్థితులలో తెలంగాణా మందలి ఆంధ్రులందరికిని ఒక సారస్వత సంస్థయొక్క ఆవశ్యకత స్పష్టముగా కనపడినది. ఈ ఆవశ్యకతయే ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపనకు కారణభూతమైనది. ఈ సంస్థ 1943 మే 26 వ తేదీన రెడ్డి విద్యార్థి [illegible] జరిగిన దశమాంధ్ర మహాసభ సందర్భమున స్థాపితమైనది. ఈ సంస్థ ఆదర్శాలు

1. రాష్ట్రాంధ్రులలో మాతృభాషాభిమానమును పెంపొందించుటు.

2. ఆంధ్ర భాషాభివృద్ధికై సర్వవిధముల కృషి చేయుట. ఇందుకొరకు సంస్థ నిర్ణయించుకొనిన సాధనాలు.

1. రాష్ట్రమునందలి వివిధ ప్రాంతాలలో వివిధ వాఙ్మయ శాఖలతో కూడిన సమావేశాలు జరిపి, ప్రబోధము కలిగించుట.

2. పాఠ్యప్రణాళికను సిద్ధపరచి పరీక్షలను నిర్వహించుట.

3. రాష్ట్రమందు గల సారస్వత సంస్థలను సారస్వత సేవకులను ప్రోత్సహించుట.

4. ఉత్తమ గ్రంథములకు పారితోషికముల నిచ్చియు, రచయితలకు సన్మానములను జరిపియు వారిని ప్రోత్సహించుట.

ఈ ఆంధ్ర సారస్వత పరిషత్తు ఉద్యమమును గూర్చి ఆంధ్ర పితామహ పద్మవిభూషణ మాడపాటి హనుమంతరావు పంతులుగారు తమ ఆంధ్రోద్యమ చరిత్రలో 1950 సంవత్సరమున అనగా అయిదు సంవత్సరాల క్రింద "....తెలంగాణములో యీ కాలమున నేర్పడిన ప్రబోధము యొక్క ఫలితముగా ఆంధ్ర సారస్వతోద్యమ మనునది 10 వ ఆంధ్ర మహాసభ హైదరాబాదులో జరిగిన పిదప, ఆంధ్రమహాసభాంగణముననే ఆ సమయముననే జన్మించి క్రమ వికాసము పొందుచున్నది....అదియొక ప్రత్యేక చరిత్రకు వలయు సాధనములను సమకూర్చుచున్నది." అని సెలవిచ్చియున్నారు. 1950 లో విద్యాశాఖామంత్రిగా నుండిన ప్రస్తుత ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు పరిషత్తు కృషిని గూర్చి ప్రశంసించుచు "...సూర్యుని వెలుతురు వలె పరిషత్తు ఉద్యమము పల్లె పల్లెకు వ్యాపించి అజ్ఞాన తమస్సును నివారించుచున్న"దని తెలిపిరి.

ఇప్పటివరకు ఆంధ్రసారస్వత పరిషత్తు వార్షికసమావేశాలు 1. హయిదరాబాదు, 2. వరంగలు. 3. నల్లగొండ, 4. మహబూబునగరం, 5. తూప్రాన్. (మెదక్‌జిల్లా), 6. మంచిర్యాల, (ఆదిలాబాదజిల్లా) 7. అలంపూర్, (రాయచూరుజిల్లా) లలో జరిగినవి. వేలకొలది ప్రజలను యీ

సమావేశాలు ఆకర్షించినవి. వానిలో చక్కని సాంస్కృతికాభిరుచిని కలుగ జేసినవి. అలంపూరు మహాసభకు భారత ఉపరాష్ట్రపతి ఆచార్య రాధా కృష్ణులు ప్రారంభోత్సవము చేసి పరిషత్తు కృషిని ఆశీర్వదించిరి. ఈనాడు పరిషత్తునకు తెలంగాణములో రెండువందలకుపైగా శాఖలున్నవి. పరిషత్తుకృషి బొంబాయి, మద్రాసు, ఆంధ్రరాష్ట్రమందలి బాపట్ల, విద్యానగరము కర్నూలు, నంద్యాల, వినయాశ్రమము, ఉరవకొండ, వినుకొండ, ఆలూరు మొదలగు ప్రాంతములకు వ్యాపించినది. పరిషత్తు ప్రాథమిక, మాధ్యమిక, ప్రవేశ, విశారద పరీక్షలను నిర్వహించుచున్నది. ఇందులో ప్రవేశ విశారద పరీక్షలు హైదరాబాదు ప్రభుత్వము ఒప్పుకొన్నది. ఈపరీక్షలలో ప్రతిసంవత్సరము వేలకొద్ది విద్యార్థులు పాల్గొనుచున్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయములో తెలుగుభాషను నిర్బంధపఠనీయముగా జేయుటకు పరిషత్తుకృషియే ప్రధానకారణము. గ్రంథాలయోద్యమము పరిషత్తు కార్యక్రమములో ముఖ్యమైనది. హైదరాబాదునగరంలో 1953 సంవత్సరమున అఖిలభారత గ్రంథాలయ మహాసభలు జరుపుటలో పరిషత్తుప్రధాన పాత్ర వహించినది. కార్యకర్తలలో సాంస్కృతికాభిరుచిని కలిగించుటకు పరిషత్తు శిక్షణశిబిరాలను నిర్వహించినది. ఉత్తమగ్రంథ ప్రకటన పరిషత్తు ఆశయాలలో ప్రధానమైనది. పరిషత్తు ప్రకటించిన గ్రంథాలలో బాలవాఙ్మయము, సారస్వతము, చరిత్ర, జానపదవాఙ్మయములకు సంబంధించిన ముప్పది ఉత్తమగ్రంథాలు కలవు. పరిషత్తు ప్రకటించిన ప్రతాపరెడ్డి గారి ఆంధ్రుల సాంఘికచరిత్రకు మనకు స్వాతంత్ర్యము వచ్చినతరువాత ఆంధ్రభాషలో ప్రకటితమైన గ్రంథాలలో ఉత్తమమైనదిగా కేంద్రప్రభుత్వ సాహిత్య అకాడమీవారు నిర్ణయించి, అయిదువేల రూపాయల బహుమతి నిచ్చిరి. తెలంగాణములో గతవినశతాబ్దమునందు సాంస్కృతిక పునరుజ్జీవనమునకై, ఆంధ్రసారస్వత పరిషత్తు చేసినసేవ ప్రశంసనీయమైనది.

విజ్ఞానవర్ధిని పరిషత్తు, స్త్రీల ఆరోగ్య విద్యాపరిషత్తు అను రెండు సంస్థలు పోలీసుచర్యకు చాలకాలముముందే స్థాపితమై స్త్రీలఆరోగ్యము

నకు, మరియు ప్రయోజన విజ్ఞానానికి అవసరమైన మంచిగ్రంథాలను ప్రక టించిన [illegible] అయిదుసంవత్సరాలలో స్థాపితమై కృషిచేయుచున్న సారస్వత సంస్థలలో తెలంగాణారచయితల సంఘము ఎన్నదగినది. ఇది యువ రచయితలచే నిర్వహింపబడుచు కవిసమ్మేళనాలద్వారా చక్కని ప్రబోధము కలుగజేయుచున్నది. కవిత్వమును ఉన్నతముగా ప్రచారము చేయవలెనని రచయితల సంఘ ఉద్దేశము. ఈ ఉద్దేశముతోనిది ప్రశంసనీయ ముగా పనిజేయుచున్నారు. సవ్యసాచిసమితి యువకుల కథానికలను వికాం శిక్షలను ప్రకటించుచు మంచి సేవజేయుచున్నది. ఈసంవత్సరమున కళా శాలలలోను, పాఠశాలలలోను ఆంధ్రసారస్వత సంస్కృతుల వ్యాప్తికై జరి గినకృషినిగూర్చి ప్రస్తావించుట అవసరము. హైద్రాబాదులో ఆకాలమున నిజాంకళాశాల మద్రాసు విశ్వవిద్యాలయమునకు అనుబంధసంస్థగా నుం డెను. అందుచేత ఇతరకళాశాలలలో ఆంధ్రసారస్వత సంఘాలకులేని అవకాశాలు నిజాంకళాశాల ఆంధ్రసారస్వత సంఘమునకు ఉండెను. ప్రతిసంవత్సరము యీ కళాశాల ఆంధ్రసారస్వత సంఘము వార్షికోత్స వాలనుజేసి, సారస్వత సభలనుజరిపి నాటకాలను ప్రదర్శించి, యువకు లను ఆంధ్రసారస్వత సంస్కృతులవైపు ఆకర్షించెను. నిజాంకళాశాల లోని ఆంధ్రసారస్వతసమితి అనేక యువకహృదయాలపై ఆంధ్రత్వ ముద్రవేసినది. ఆంధ్రమహాసభ క్రమక్రమముగా రాజకీయసంస్థయైన తరు వాత, నిజాంకళాశాలలోని ఆంధ్రసారస్వతసమితితెలుగు సారస్వతసమితిగా మారినది. హేతువుఇందుకు ఆంధ్రశబ్దముమీద అప్పటి ప్రభుత్వమునకు అధికారులకు, పరిపాలకులకు ఉండిన గాఢమైన అనుమానాలు; ద్వేషము. నిజాంకళాశాల ఆంధ్రసమితి పక్షాన మొదలొక సారస్వతసంచిక కొంత కాలము వ్రాతలోవెలువడి తరువాత పోలీసుచర్యకు పూర్వమే 1939 ప్రాంతమున ముద్రితసంచికగా వెలువడుట ప్రారంభమైనది. ఇదేవిధ ముగా నారాయణగూడెము బాలికాపాఠశాలలోను, ఉస్మానియా విశ్వవిద్యాల యములోను చాదర్ఘాటు కళాశాలలోను వరంగల్ కళాశాలలోను ఇతరపాఠ శాలలలోను తెనుగుసారస్వత సంఘాలు చక్కగా పనిచేసినవి.

పోలీసుచర్యతరువాత మారిన పరిస్థితులలో స్వతంత్ర వాతావరణ ములో [illegible] సక్రమముగా అభివృద్ధిచెందినది. ప్రతి కళాశాలలోను పాఠశాలలోను తెలుగుసారస్వత సంఘాలు స్థాపితమై పని చేయుచున్నవి. హైస్కూలు తరగతులలోకూడ మాతృభాష బోధనాభాష యై, విశ్వవిద్యాలయములో మాతృభాషలకు స్థానములభించి, విద్యార్థుల ఉత్సాహముఎన్నియోరెట్లు అతిశయించినది. తౌరక్యాంధ్రులుతెనుగుమీరిన ఆంధ్రులుగా రూపొందుట ప్రారంభమైనది. ప్రతిపాఠశాలయందలి, కళా శాలలయందలి సారస్వతసంఘాలు, పత్రికలద్వారా సారస్వతసంచికల ద్వారా, నాటకప్రదర్శనాలద్వారా, ఆంధ్రసరస్వతిని ఆరాధించుచు, యువ కులలో దాగుకొనియున్న ప్రతిభను ప్రకాశితముగావించుచున్నవి. ఐదు సంవత్సరాలనుండి హయిదరాబాదు నగరమున అన్నికళాశాలల పక్షాన ఆంధ్రాభ్యుదయోత్సవాలు ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రేరణవలన సహకారముతో దిగ్విజయముగా నిర్వహింపబడుచు హయిద్రాబాదు అచ్చ మైన ఆంధ్రనగరమని ఋజువుచేయుచున్నవి.

హైదరాబాదురాష్ట్రములో ఆంధ్రసాంస్కృతిక పునరుజ్జీవనానికి పత్రికలుచేసిన సేవ మిక్కిలిగొప్పది. ఈపత్రికల సేవనుగూర్చి ప్రస్తావిం చుచు మాడపాటి హనుమంతరావుపంతులుగారు“......ఎన్నియో శ్రమల భరించి పనినడుపుచుండిన పైపత్రికలు ఆంధ్రోద్యమ వ్యాప్తికై చేసినసేవ ఇంతింతనిచెప్పుట దుస్సాధము. ముఖ్యముగా ప్రారంభకాలమున నీల గిరి తెనుగుపత్రికల”వంటి వార్తాపత్రికలు దేశమున లేకయే యుండినచో ఆంధ్రోద్యమమునకు ఈపాటివ్యాప్తి, వికాసములు లభించియే యుండక పోవునని చెప్పినచో, అదేమాత్రము అతిశయోక్తి యుండజాలదు. తెలం గాణములో మొదటి తెనుగుపత్రిక “హితబోధిని” ఇదిమాసపత్రిక. 1913 సంవత్సరములో మహబూబునగరమునుండి ప్రారంభమై, ఒకసంవత్స రములోనే అంతరించినది. ఈ పత్రికా సంపాదకులు శ్రీనివాసశర్మగారు. తరువాత అయిదేండ్లవరకు తెలంగాణములో ఒక పత్రికయైనను రాలేదు.

1920 సంవత్సరమున రెండు వారపత్రికలు ఒకమారు ప్రారంభమయ్యె ను. వరంగలుజిల్లా మానుకోటతాలూకాలోని ఇనుగుర్తియను గ్రామము నుండి తెనుగుపత్రిక వారపత్రికగా ప్రారంభమయ్యెను. ఈపత్రికా సంపా దకులు ఒద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవ రంగారావు అను సోదరులు. వీరిరువురు సంస్కృతాంధ్రములందు మంచిపండితులు, కవు లు, రచయితలు. ఉర్దూ ఆంగ్లములలో తగినంత పరిచయముకలదు. ఇప్పటికని వీరు సజీవులుగా నున్నారు. నీలగిరిఅను పత్రిక ఇదేసమయ మున ఒకనాటిభేదముతో నల్లగొండనుండి వెలువడినది. ఈపత్రికా సంపా దకులు షబ్నవీసు నరసింహారావుగారు- ఇప్పుడు వీరు కీర్తిశేషులు. ఈ రెండుపత్రికలు తెలంగాణములో ఆంధ్రోద్యమ గ్రంథాలయోద్యమాలను ప్రోత్సహించి, రచయితలను, కవులను ప్రోత్సహించి, సాంస్కృతిక పున రుజ్జీవనమునకు మంచిబలము చేకూర్చినవి. తరువాత అయిదుసంవత్స రాలకు అనగా 1925 సంవత్సరమున గోలకొండ అర్ధవారపత్రిక ప్రసిద్ధ విద్వాంసులు, నాయకులునగు కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాద కత్వాన వెలువడినది. ఈ గోలకొండ తెలంగాణములో ప్రజల సాంస్కృతి కాభివృద్ధికి, రాజకీయచైతన్యానికి చేసినసేవ ఇంతింతని చెప్పరానిది. గోల కొండ ప్రారంభమైన రెండుసంవత్సరాలకు పి. యస్. శర్మగారి సంపాద కత్వమున సుజాత యను 'సారస్వతమాసపత్రిక' 1927 లో వెలువడినది. ఇది ఉత్తమతరగతికిచెందిన సారస్వత మాసపత్రిక. కాని దురదృష్టవశ మున యీపత్రిక మూడుసంవత్సరాలకన్న ఎక్కువ జీవించలేదు. తరు వాత ఇటీవల యీపత్రికను శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు పునః ప్రకటించిరి. కాని అదికూడ మూడుసంవత్సరాల కాలముననే ఆగిపోయి నది.తెనుగు, నీలగిరి పత్రికల కాలమునందే, ఓరుగల్లునుండి ఆంధ్రా భ్యుదయముఅను సారస్వత మాసపత్రిక కోకల సీతారామశర్మగారి సంపా దకత్వమున కొంతకాలము నడచినది. సుజాత ఆగిపోయిన పదిసంవత్స రాలకు సికిందరాబాదునుండి ఆంధ్రశ్రీ అను మాసపత్రిక వెలువడి ఒక

నంచికతో ఆగిపోయినది. శుక్లసంవత్సరమందు అత్రాఫ్‌బల్దా వడ్డేపల్లి గ్రామమునుండి ఒక శ్రీవైష్ణవులు దేశబంధుఅను మాసపత్రికను ప్రారంభించి మూడేండ్లు నడిపిరి. 1934, సికింద్రాబాదునుండి అడుసుమిల్లి దత్తాత్రేయశర్మగారు దక్కన్ కేసరిఅను ఆంగ్ల ఆంధ్ర మాసపత్రికనునుమారొక సంవత్సరము నడిపిరి- ఈకాలముననే గుండవరము హనుమంత రావుగారి సంపాదకత్వమున ఆంధ్రకేసరి అను మాసపత్రిక, ముఖ్యముగాయువకుల ప్రోత్సాహమున, కొంతకాలమునడిచెను- 1938లో తెలుగు తల్లి అను మాసపత్రిక సికింద్రాబాదునుండి రాచమళ్ళ సత్యవతీదేవిగారి సంపాదకత్వమున వెలువడెను. తరువాత సుప్రసిద్ధ విద్వాంసులు పండిత చిదిరమఠము వీరభద్రశర్మగారు విభూతిఅను మాసపత్రికను కొంతకాలము నడిపిరి. వారు కాశీలోన శైవమఠమునకు అధిపతులుగా వెళ్ళవలసి వచ్చినందున పత్రిక ఆగిపోయినది. 1937 నుండి సికింద్రాబాదునుంచి దివ్యవాణి అను వారపత్రిక శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారు నడిపించుచున్నారు. హైద్రాబాదు హరిజననాయకులు శ్రీ. శే. భాగ్యరెడ్డివర్మగారు కొంతకాలము భాగ్యనగర్ అను వారపత్రికను నడిపిరి. 1937-38 సంవత్సరము హైద్రాబాదురాష్ట్రములో మొదటిసారి సత్యాగ్రహము జరిగినప్పుడు, హైద్రాబాదు వాస్తవ్యులైన శ్రీ (బి. (యన్. శర్మగారు బెజవాడవెళ్ళి అక్కడినుంచి ఆంధ్రవాణి అను వారపత్రికను ఒకసంవత్సరము నడిపిరి. తెనుగు నీలగిరి పత్రికలు ప్రారంభింపబడిన తరువాత వరంగలులో శైవ ప్రచారిణి అను వారపత్రిక ప్రారంభింపబడి కొంతకాలము నడిచినది. 1945వ సంవత్సరమున హైద్రాబాదునగరమునుండి తెలంగాణ, మీజాన్ అను రెండు దినపత్రికలు ప్రారంభమై రెండుసంవత్సరాలు నడచినవి. తెలంగాణపత్రిక ఆంధ్రోద్యమానికి గొప్ప అండగానుండెను. దీని సంపాదకులు సుప్రసిద్ధ ఆంగ్లపత్రికా రచయితలైన బుక్కపట్నం రామానుజాచార్యులు గారు. మీజాన్ పత్రిక అరబ్బీపేరుతో ఒక ముస్లింవర్తకునియాజమాన్యమున నడచెను. దీనికి కీర్తిశేషులైన అడవి బాపిరాజుగారు సంపా

దకులుగా నుండిరి. బాపిరాజుగారు నవలలు గోనగన్నారెడ్డి మొదలైనవి యీ మిజాన్ద్వారా ప్రకటితమైనవి. 1931-34 సంవత్సరముల మధ్య వరంగలునుండి కీ.శే. కంభంపాటి అప్పన్నశాస్త్రిగారు పూలతోటఅను పిల్లల మాసపత్రిక నొకదానిని చక్కగా నడిపిరి. అప్పన్నశాస్త్రి వేయిస్తంభాల శాసనములపై పరిశోధనాత్మకమైన వ్యాసమును గ్రంథరూపమున ప్రకటించిరి. 1947 లో శోభ అను సాహిత్య మాసపత్రిక దేవులపల్లి రామానుజరావు సంపాదకత్వమున వెలువడి వరంగలునుండి ఒకసంవత్సరము నడిచి, అప్పటి రజాకారు ప్రభుత్వకాలము నందలి పరిస్థితులవలన ఆగిపోయినది. తరువాత 1950 లో పునరుద్ధరింపబడి సుమారు రెండుసంవత్సరాలు నడిచి ఆగిపోయినది. 1947 లో అప్పటివరకు అర్ధవారపత్రికగానుండిన గోలకొండ దినపత్రికయైనది. ఇందుకు కారణభూతులు గోలకొండపత్రిక ప్రస్తుత సంపాదకులు శ్రీ నరోత్తమరెడ్డిగారు. గోలకొండపత్రిక నాటినుండి నేటివరకు సక్రమముగా వెలువడుచున్నది. రజాకారు ప్రభుత్వకాలమున హైద్రాబాదువారు చాలమంది విజయవాడ ప్రాంతాలకు వెళ్ళిరి. అక్కడవారు మూడుపత్రికలను స్థాపించిరి. సారథి, హైద్రాబాదు, తెలుగుదేశము అనునవి ఈమూడు వారపత్రికలు. సారథి, హైద్రాబాదులు కొంతకాలము నడచి ఆగిపోయినవి. తెలుగుదేశము యీనాటికిని శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మీదేవిగారి సంపాదకత్వమున చక్కగా వెలువడుచున్నది. ఇవిగాక హయిదరాబాదు రాష్ట్రమున వారపత్రికలు, మాసపత్రికలు అవతరించి అంతరించినవి. వీనిలో పేర్కొనదగినవి ప్రగతి, (వారపత్రిక) భాగ్యనగర్ (ఇది ఇటీవల పునరుద్ధరింపబడినది,) జనశక్తి (వార) ప్రజాశక్తి (వార,) మేధావి (మాసపత్రిక,) జయభారత్ (మాసపత్రిక.) కాకతీయ (వారపత్రిక, ఇటీవల పునరుద్ధరింపబడినది.) చిత్రవిచిత్ర (వారపత్రిక,) సుదర్శన్ (తెలుగు మాసపత్రిక,) శ్రీ కుసుమహరనాథ (ఆంధ్రాంగ్ల మాసపత్రిక.) పద్మశాలి, (మాసపత్రిక,) నవయుగం అను వారపత్రిక కమ్యూనిస్టు నాయకులైన రావి నారాయణరెడ్డిగారి సంపాద

కత్వాన వెలువడుచున్న రాజకీయ వారపత్రిక. నేత అను పత్రిక చేనేత సహకార సంఘ సమస్యలను ప్రధానముగా తీసికొనుచు నిర్వహింపబడు చున్న వారపత్రిక- మొత్తముమీద తెలంగాణములో పత్రికల జీవనము మిక్కిలి ఒడుదొడుకులతో కూడియుండెనని స్పష్టము కాగలదు- మూడు సంవత్సరాలకన్న యెక్కువ జీవించినపత్రికలు స్వల్పము. ఈనెలలో ఆంధ్రజనత అను నొకతెలుగు దినపత్రిక సికింద్రాబాదునుండి వెలువడు చున్నది. ఈపత్రికలన్నియును తెలంగాణములో సాంస్కృతిక పునరుజ్జీవ నానికి బలమైన ఊతనిచ్చినవి.

తెలంగాణము లోరచయితలను ప్రోత్సహించి,పుస్తకాలన్ప్రకటించు ఉద్దేశముతో కొన్నిగ్రంథమాలలు వెలువడినవి అగ్రంథమాలలువిజ్ఞానదాయ కములగు పుస్తకాలనుప్రకటించినవి.అట్టివానిలో పేర్కొనదగినవి 1.గోల కొండ, 2. కిన్నెర,3. దివ్యవాణీసుకృతిప్రాకారము, 4. మాతృభారతి,5. ఆంధ్ర శ్రీ, 6. కాకతీయ, 7. పూలతోట, 8. వీరేశలింగకవికంఠాభరణ, 9. కృషిప్రచారిణి, 10. శివధర్మ గ్రంథమాల, 11- విజ్ఞానప్రచారిణి, 12. వెంకటేశ్వర, 13. అణా, 14. దేశోద్ధారక, 15. ఆంధ్రకేసరి, 16. ఆం ధ్రచంద్రిక, 17. కావ్యమాల, 18. తెలంగాణ, 19. సారస్వతచంద్రికా గ్రంథమాలలు ఎన్నదగినవి. ఈగ్రంథమాలలుకూడ ఒకొక్కటి రెండు మూడు సంవత్సరాలకన్న ఎక్కువ జీవించలేదు. ఈసందర్భమున ఆంధ్ర వాఙ్మయ సేవాసమితి, బూరుగంపాడు కొన్ని మంచిసంచికలను ప్రక టించినదని మనము గమనించవలసి యున్నది. ఉస్మానియా విశ్వవిద్యా లయము సంఘలి తెలుగుఅధ్యాపకులు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు తెలుగులో సంగ్రహ విజ్ఞాన కోశమును ప్రకటించు ప్రయత్నము ప్రారం భించినారు. ఈసంగ్రహ విజ్ఞానకోశముయొక్క వివరణ అచ్చుఅయినది. విజ్ఞానకోశముయొక్క రచనాప్రయత్నాలు ప్రకటనా ప్రయత్నాలు చురు కుగా సాగుచున్నట్లు తెలియుచున్నది. ఆనాడు లక్ష్మణరావుగారు హైద్రా బాదులో స్థాపించిన విజ్ఞానచంద్రికా మండలి బీజాలు యీవిధముగా

అంకురించి, మొలకెత్తి, పెరిగి, శాఖోపశాఖలతో కుసుమించి ఫలించు చున్నవి.

హయిదరాబాదు రాష్ట్రములో సాంస్కృతిక దీపమును ఆరిపోకుండ కాపాడిన గౌరవము సంస్థానాధీశ్వరులకు చెందుచున్నది. ఈ సంస్థానాలలో ప్రత్యేకముగా ప్రశంసించదగినవి గద్వాల, వనపర్తి సంస్థానాలు. ఈ రెండు సంస్థానాలు తెలుగుభాషకు గొప్పసేవ జేసినవి. 1880 ప్రాంతములో గద్వాల, వనపర్తి సంస్థానాలలో తెలుగు అచ్చుయంత్రాలు స్థాపితమై గ్రంథాలు ముద్రితము అయ్యెను. వనపర్తి సంస్థానానికి చాలకాలము మానవల్లి రామకృష్ణ కవిగారు ముఖ్యులుగా నుండిరి. వనపర్తి సంస్థానమువారి అచ్చు యంత్రశాలలో బ్రహ్మ విద్యావిలాస ముద్రణాలయమున రామకృష్ణకవిగారు తమపరిశోధనలకు ఆటపట్టయిన ఉత్తమగ్రంథాలను అచ్చువేయించిరి. కవులను, గాయకులను, పండితులను పోషించి యీ సంస్థానాలు సంస్కృతాంధ్రములను కాపాడినవి.

ఈసంస్థానాల పోషణలో ఉద్దండులైన పండితులు, కవిచక్రవర్తులు ఉండిరి. వారిలో కొందరిని ప్రశంసించుట అవసరము.

1. అకింతల సుబ్బాశాస్త్రులు.

వనపర్తి సంస్థానములోని వేపర్ల గ్రామము. 85 సంవత్సరముల క్రిందట నుండిరి. భాష్యార్థరత్నమాల అను గ్రంథమును ఆర్యావృత్తములలో వ్రాసిరి. ఒక ప్రహసనమును సైతమువ్రాసిరి. జగద్విఖ్యాతవిద్వాంసులు, తర్క వేదాంత వ్యాకరణ శాస్త్ర పరిశ్రమచేసి కాశీపండితుల మన్నన పొందినవారు. వీరి రెండవకుమారుడు అకింతల శింగరశాస్త్రిగారు. వీరు జటప్రోలు సంస్థానములోని అయ్యవారుపల్లెలో నివసించిరి. భాస్కర ఖండమును ద్వాదశమంజరీ స్తోత్రములు మున్నగు గ్రంథములు వ్రాసిరి. వీరివంశము పండితవంశము. గతవిశ్వావసు సంవత్సరమున మరణించిరి.

2. శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాల యతీంద్ర మహాదేశికులవారు.

పరకాల మఠము మైసూరులోనున్నది. వీరు ఆ పీఠాధిపతులు. గృహస్థాశ్రమములో వీరు వనపర్తిసంస్థాన ధర్మాధికారులు. హొసదుర్గము కృష్ణమాచార్యులు నామధేయము- శతాధిక గ్రంథకర్తలు. వసుదుర్గం, హొసదుర్గం,వారేఎక్కువగా పరకాలమఠాధిపతులైనారు. గద్వాల సంస్థానములో తిరుపతివెంకటకవులనుఢీకొన్న పురాణం నరసింహాచార్యులవారును, మానాజిపేట రంగాచార్యులుగారును పరకాల మఠాధిపతులైరి. పరకాలస్వాముల వారందరును వివిధ గ్రంథరచయితలు, విద్వాంసులు. మైసూరునందలి పరకాల మఠమునకును వనపర్తి, గద్వాల, మానాజిపేటల విద్వద్వంశములకును, చిరంతనమైన బాంధవ్యమున్నది, నేటికిని వసుదుర్గమువారే పీఠాధిపతులు.

3. బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులుగారు: ఆత్మకూరుసంస్థానము.

ఎనిమిది తరములనుండి వీరివంశమువారు కవులు. వీరు ఏడవ సంవత్సరమునుండియే కవిత చెప్పనేర్చిరి. 15వ యేట 'బాలకవి' బిరుదము మైసూరు సంస్థానములో, 'బాలసరస్వతి' బిరుదము నవద్వీపములో 'తర్కతీర్థ' బిరుదము, దర్భాంగ, జోధ్‌పూర్, గ్వాలియర్, జ్యోతిపురము, కోటాంజర, ఇందూరు, ధారానగర్, జమ్మూ మొదలైన సంస్థానములలో పాండిత్య ప్రదర్శనముచేసి కవితచెప్పి గౌరవమునకు పాత్రులైరి. ప్రాకృతములు, సంస్కృతము, ఆంధ్రము, ఈభాషలలో ఆశుధారాకవనము. బళ్ళారి, మద్రాసు, కడప, ప్రొద్దుటూరు, బసగానిపల్లె, పెనుగొండమున్నగుస్థలములలో అవధానములు, శతఘంటాకవనము. నిర్వహించిరి. బహు గ్రంథకర్తలు. జననము శా.శ. 1785, మరణము 1841. హిందూ, మద్రాసు మెయిల్, స్టాండర్డువంటి పత్రికలు వీరి ఆశుకవితను శ్లాఘించినవి. తిరుపతి వేంకటకవులను ఢీకొని ఆరుమాసములవరకు ప్రభుసత్కారము నొందనీయుని పటిష్ఠపండితకవి యీయన.

౪. వెల్లాల సదాశివశాస్త్రిగారు. అయ్యవారుపల్లె, కొల్లాపురము. సుమారు ముప్పదిసంవత్సరముల క్రిందట మరణించిరి.

కాశీలో వ్యాకరణ శాస్త్రాభ్యాసం. గద్వాల, బొబ్బిలి, వెంకటగిరి, మొదలగు సంస్థానములలో బహుమతి, సురభి మాధవరాయల చంద్రికా పరిణయమునకు వ్యాఖ్యానమును, సరసభూపాలీయ రసప్రకీర్ణమునకు వివరణమును వ్రాసిరి. సంస్కృత కవులు. 15 ముద్రిత గ్రంథములును 7 అముద్రితగ్రంథములునుకలవు. వెలుగోటివంశచరిత్రను వ్రాయునప్పుడు వివిధప్రాంతములవిద్వాంసులమన్నన లందుకొన్నవారు. దైన్యములేని ధైర్య గాంభీర్యములతో జీవించిన పండితేంద్రులు. వీరియన్నకుమారులైన వెల్లాల శంకరశాస్త్రిగారు తిరుపతిలో తర్క వ్యాకరణములను చదివి కర్నూలు మొదలగుప్రదేశములలో నిరంతరసంస్కృత విద్యాబోధనుగావించిరి. దత్తమండలము మహబూబునగరము ప్రాంతమునందలి నేటి సంస్కృత విద్వాంసులలో పెక్కండ్రు వీరిశిష్యులే. సురవరము ప్రతాపరెడ్డి వీరి ప్రియశిష్యుడు. వెల్లాలవారి వంశము విద్వద్వంశము. జ్యోతిష వైద్యశాస్త్రములు వీరి యింటివిద్యలు.

5. కవితార్కిక సింహం గోవిందాచార్యులుగారు, మంచాలకట్ట, కొల్లాపురం తాలూకా, మహబూబునగరం జిల్లా.

వీరు తిరుపతిలోకపిస్థలం దేశికాచార్యులవారియొద్ద తర్కశాస్త్రమును, నరకంఠీరవశాస్త్రి గారి సన్నిధిని అలంకారశాస్త్రమును అధ్యయనము చేసిరి. తర్క వ్యాకరణ వేదాంత మీమాంసా శాస్త్రములందు వీరికి పాండితి యబ్బినది. నెల్లూరు సంస్కృత కళాశాల యందు బహుకాలము తర్కాలంకార శాస్త్రములను బోధించిరి. కవితార్కిక సింహము వారు పూర్వము నుండియు మంచాలకట్టవారే. వీరు సర్వతంత్ర స్వతంత్రులు. ఈ వంశము నందలి వేదాంతాచార్యులు, శ్రీనివాసాచార్యులు మున్నగువారు బహు గ్రంథకర్తలు. గోవిందాచార్యులవారు అప్పయ్య దీక్షితుల చిత్రమీమాంసను 'అలంకారశాస్త్రము' పాఠము చెప్పుటలో నద్వి

తీయులు. వీరి పూర్వులు వ్రాసిన చిత్రమీమాంసా వ్యాఖ్యానము వీరి యొద్ద నుండెను. అలంకారశాస్త్ర మన్న వీరికి ప్రాణతుల్యము.

6. సింగంపల్లి సిద్ధాంతిగారు.

పేరు- నరసింహ సిద్ధాంతి. నివాసం మహబూబునగరం జిల్లాలోని సింగంపల్లి. ఇది వీరి ముఖ్యగ్రామం.

జ్యోతిషములో గొప్ప విద్వాంసులు. మైసూరు రాజసభలో బహుమతిని బడసి ప్రతి నెలకును అచ్చటి నుండి పండిత వేతనమును జీవితాంతము వరకును పొందినవారు. వనపర్తి సంస్థానమువారికి ప్రేమపాత్రులు. "భూభ్రమణ భ్రాంతి నిరసన" మను గ్రంథమును రచించినారు. ఇటీవలనే మరణించిరి.

7. గోపాలపేట రాఘవాచార్యులు గారు.

వీరి యింటిపేరు బుక్కపట్టణం. నివాసము గోపాలపేట, మహబూబు నగరం జిల్లా. కాశీలో వ్యాకరణ శాస్త్రాభ్యాసం. మైసూరు విద్వత్పరీక్షలో నుత్తమోత్తమముగా విజయమంది, అచ్చటి కస్తూరి రంగాచార్యుల వారిచే సెబాసనిపించుకున్నవారు. గోపాలపేట లక్ష్మీనరసింహశాస్త్రి గారివద్ద వీరు కొంత గురుముఖమున చదివి తక్కిన శాస్త్రమును స్వయముగా నన్వయించుకొనిరి. ఇప్పుడు ప్రసిద్ధులై యున్న ఖండవెల్లి నరసింహశాస్త్రి గారికి పరమ గురువులు- రాఘవాచార్యులవారు సుమారు 80 సంవత్సరములు జీవించి ఇటీవల మరణించిరి. వీరి పెద్దకుమారులైన రామచంద్రాచార్యులు గారు శతావధాని, శతాధికాంధ్ర గ్రంధకర్త.

8. కర్నమడకల అనంతాచార్యులు గారు.

గద్వాల సంస్థాన పండితులు. కాశీ నుండి శివకుమార పండితుడు వచ్చి సంస్థాన విద్వాంసుల నందరి నోడింపగా వీరు వారి పూర్వపక్షము ఖండించి మెప్పువడసిరి. "మదన విజయభాణము, ఆచార్య వింశతి, ఆంధ్రశబ్ద చింతామణి" వీరి అముద్రిత రచనలు. గత హేవళంబి సంవ

త్సర కార్తిక శు॥ ౬ నాడు కాశీలో మరణించిరి. వీరు కాశీ పండితులకు సుపరిచితులు. శివకుమార పండితునికి ప్రేమాస్పదులు.

గద్వాల వాస్తవ్యులేయైన పుల్లగుమ్మి వేంకటాచార్యులవారు గొప్ప వైయాకరణులు, సంస్కృతాంధ్ర రచయితలు. అలుకూరి మల్లిఖార్జున శాస్త్రి గారు శతావధానులు. గణితశాస్త్రమున ఎన్నికోట్ల సంఖ్యలైనను నోటితో లెక్కించి చెప్పగల సమర్థులు. చాల గొప్ప జ్యోతిశ్శాస్త్రవేత్తలు. వనపర్తి వాస్తవ్యులగు విక్రాల సోదరులు గొప్ప పండిత కవులు. కొన్ని సంవత్సరాల క్రింద శివసాయుజ్యము పొందిన చిదిరె మఠము వీరభద్ర శర్మ గారు నల్లగొండ జిల్లా చర్లపల్లి వాస్తవ్యులు. కాశీలో వారొక శైవ పీఠానికి అధిపతు లైనారు కూడ. వేదతీర్థ, కావ్యతీర్థ, స్మృతితీర్థ, ధర్మాచార్య, సాహిత్య విశారద మున్నగు బిరుదాంకితులు. మహారాష్ట్ర, కర్ణాటక, సంస్కృతాంధ్రములు బాగుగా తెలిసి కవిత్వము చెప్పగల సమర్థులు. మంచి విమర్శకులు, ప్రామాణికులైన పండితులు, వక్తలు. గద్వాలలో అస్థాన కవీశ్వరులుగా నుండి గతించిన శ్రీ గాడెపల్లి వీరరాఘవ శాస్త్రిగారు అద్వితీయమైన ధార, గొప్ప ప్రతిభ కలిగిన ఉద్దండ కవీశ్వరులు. నేటికిని తెలంగాణమున ఉద్దండ పండితు లెందరో ఉన్నారు. వీరిలో ప్రస్తుతము హైద్రాబాద్‌లోని సీతారాంబాగ్ సంస్కృత కళాశాలలో అధ్యాపకులుగా నున్న వట్టెం నరసింహశాస్త్రిగారు గొప్ప వైయాకరణి. ప్రస్తుతము ప్రభుత్వ విద్యాశాఖ నుండి ఉపకార వేతనము పొందుచున్న అయితంరాజు కొండలరావుగారు సంస్కృతాంధ్రాంగ్లములే కాక అరబ్బీ, ఫార్సీ, కర్ణాటకాది బహుభాషల యందు పండితులు. వీరొక ఉర్దూ తెనుగు నిఘంటువును వ్రాసివారు. హైద్రాబాద్ రాష్ట్రములో ఉన్నతోద్యోగము నిర్వహించి, నేటికిని సజీవులుగా నున్న శ్రీ గుండేరావు హర్కారె గారు సంస్కృతములో ఉద్దండులైన పండితులు.

గద్వాల, వనపర్తి, ఆత్మకూరు సంస్థానములలో కవిత్వము, సంస్కృతము, నృత్యము, చిత్రకళ మున్నగువానికి ప్రతి సంవత్సరము

సత్కారములు జరుగుచుండెను. మైసూరు బిడారు కృష్ణప్ప మొదలైన వారు వేయినూట పదహార్లతో సత్కరింపబడిరి. సంగీతమున కన్ని విద్వాంసులకన్నను బహుమాన పరిమితి యెక్కువ. నేడు ప్రసిద్ధులైన సంగీత విద్వాంసు లందరును గద్వాలను త్రొక్కినవారే. గోపాలపేట మున్నగు స్థలములందు జావళీలు, పదములు పాడి నృత్యము చేయగల వేశ్యా బృందము లుండెను. వారికిని ప్రభు సత్కారము విరివిగా లభించెను.

గద్వాల సీతారామ భూపాల్ గారు పండితులతో సంస్కృత నాటకాలను ప్రవర్తింపజేసినారు. కొల్లాపురంలోని స్నేహలతా కవితాసంఘము కవిత్వ మును ఉద్యమరీతిగా ప్రచారము గావించుటకు కృషి జేసెను. ఈ విధ ముగా గ్రంథాలయోద్యమము, ఆంధ్రోద్యమము, పత్రికలు, గ్రంథ మాలలు, సంస్థానాలు అక్కడి కవి పండితులు తెలంగాణములో సాంస్కృతిక పునరుజ్జీవనానికి చక్కని వాతావరణము కల్పించినవి. తత్ఫలితముగా ఆధునిక పద్ధతుల ప్రకారము రచనలు చేయుటకు తెలం గాణ క్షేత్రమున బీజావాపనమైనది. ఎన్నియో పాదులు కల్పించబడి నవి. ఈ పాదులలో ప్రభవించిన సాహిత్యవల్లి క్రొత్తక్రొత్త పూవు లనేక ములు విరియబూచి కమ్మతావులను వెదజల్లినది. యువకులు సారస్వత రంగమున నూతన మార్గముల నన్వేషింపసాగినారు. ఉన్నతవిద్య నభ్య సించిన యువకులు సాహిత్య సాంస్కృతిక రంగాలలో అడుగుపెట్టి, ఖండ కావ్యము, అభ్యుదయ కవిత్వము మొదలైన వివిధ వాఙ్మయవీధులలో తెలుగుతల్లికి పూలదండలను వేయుచున్నారు. ఖండకావ్య రచనలలో ప్రసిద్ధిగాంచినవారిలో శ్రీ నరుగూరి జయరావు, వీరు కీర్తిశేషులు, ఐ. ఏ. యస్. లో ప్రవేశించి మధ్యరాష్ట్రములో కలెక్టరుగా నుండిరి. కే. వే. కోదాటి రామకృష్ణారావు, తూమునూరు నాగభూషణరావు, గవ్వా అమృత రెడ్డి, వానమామల వరదాచార్యులు, పులిజాల హనుమంతరావు, ధవళా శ్రీనివాసరావు, బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి, నెల్లుట్ల రామకృష్ణామాత్య మొదలైనవారు ఖండకావ్య రచనలో సిద్ధహస్తులైరి.

ఆంధ్ర సారస్వతమున మొట్టమొదట కథానికా రచయితలలో మాడపాటి హనుమంతరావు పంతులుగారిక స్థానము కలదు. ఆ రోజులలో వారు రచించిన కథలు, మున్షీ ప్రేంచంద్ కథలకు చేసిన అనువాదాలు కృష్ణాపత్రికలో ప్రకటితమైనవి. హనుమంతరావుపంతులుగారే కథానికా రచనలో తెలంగాణా యువకులకు మార్గదర్శకులు. తరువాత తెలంగాణ కథకులు చాలమంది ఉద్భవించినారు. వారిలో పేర్కొనదగినవారు కే. శే. సురవరం ప్రతాపరెడ్డి, నందగిరి వెంకటరావు, నందగిరి ఇందిరా దేవి, భాస్కరభట్ల కృష్ణారావు, ఎల్లాప్రగడ సీతాకుమారి, బూర్గుల రంగనాథరావు, నెల్లూరి కేశవస్వామి, ఇల్లిందల సరస్వతీదేవి, పొట్లపల్లి రామారావు, డి. రామలింగం మానేపల్లి తాతాచార్య ప్రభృతులు కలరు. కవులలో ప్రజా సమస్యలను తీసికొని, గేయరచన గావించినవారిలో శ్రీ కాళోజి నారాయణరావు ముఖ్యుడు. ఈయన గేయాలు "నా గొడవ" అను పుస్తకరూపమున ప్రకటితము. ఈయన ఆంధ్రదేశములోని గరిమెళ్ళ సత్యనారాయణగారి పంటివారు. తెలుగు భాషలో చక్కని వ్యాసములను, విమర్శలను వ్రాసినవారు తెలంగాణములో పలువురు కలరు. తిరిగి యీ రంగమున మాడపాటి హనుమంతరావుగారు ప్రముఖులు. సుజాతలో ఫిరదౌసి కవినిగూర్చి వ్రాసిన వ్యాసమువారి విమర్శనాపటిమకు నిదర్శనము. ప్రస్తుతము ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారు మంచి విమర్శకులు, బహుభాషా కోవిదులు, కవులు, ఫార్సీ వాఙ్మయ చరిత్ర, ఎంకిపాటల విమర్శ, అప్పకవి జన్మస్థాన చర్చ మొదలైన వీరి విమర్శనా వ్యాసాలు వీరి పరిశోధనా పటిమకు నిదర్శనాలై, ఆంధ్ర విమర్శనా వాఙ్మయమున అగ్రశ్రేణిలో నుండతగినవి. శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు తెలంగాణ వ్యాస రచయితలలో ప్రముఖులైనవారు. లక్ష్మణరాయ పరిశోధక మండలికి వీరు అయువుపట్టు. అనేక సంస్థలద్వారా వీరు సంస్కృతి వ్యాప్తికి కృషి జేసినారు. వీరు గ్రంథకర్తలు. చరిత్ర పరిశోధకులు. బహుభాషా ప్రవీణులు. తెలంగాణా విజ్ఞానకోశము.అభ్యుదయమార్గమున కవిత్వ రచన గావించుచున్న

దాశరధి కృష్ణమాచార్యులు సకలాంధ్ర ప్రశస్తిగాంచిన తెలంగాణ యువ కవి. సి. నారాయణరెడ్డి దాశరధి సాంప్రదాయానికి జెందిన మరొక యువకవి. ఈనాడు తెలంగాణ యువ కవులలో సిరిప్రగడ భార్గవరావు, గడియారం రామకృష్ణశర్మ, కేశవపంతుల నరసింహశాస్త్రి, సోమరాజు ఇందుమతీదేవి, పల్లా దుర్గయ్య. బి. రామరాజు, అద్లూరి అయోధ్యరామకవి, పొట్టపల్లి రామారావు, మొదలైనవారు కలరు. ఈ విధముగా ఆధునికాంధ్ర సారస్వతమున అన్నిరంగాలలో తెలంగాణ యువ కవులు ముందుకు వచ్చి కృషిని గావించుచున్నారు.

తెలంగాణములోని విద్యాసంస్థలను గూర్చి కూడ ఒకమాట. హైద్రాబాద్ రాష్ట్రములోని జిల్లాల ప్రజలకు విద్యా సౌకర్యాలు మిక్కిలి తక్కువగా లభించినవి. పోలీసుచర్యకు పూర్వము జిల్లాలలో విద్యా వ్యాప్తిని గూర్చి ప్రభుత్వము తీసుకొనిన శ్రద్ధ మిక్కిలి స్వల్పము. విద్యాశాఖమీద వ్యయము చేయబడిన డబ్బులో హైద్రాబాదు పట్టణము లోనే అనగా నూటికి పదిమంది తరగతికి చెందిన ప్రజలు, ముస్లింలు, కేంద్రీకరించి నివసించు ప్రాంతములోనే వ్యయము చేయబడుచుండెను. అందుచేత నూటికి తొంబదిమంది తరగతికి చెందిన ప్రజలు నివసించు చుండిన ప్రాంతములో విద్యా సౌకర్యాలు, విద్యాశాఖమీద వ్యయము మిక్కిలి స్వల్పముగా నుండెను. జిల్లాకు ఒక హైస్కూలు మాత్రమే యుండెను. ఒక్కొక్క జిల్లాలో మాధ్యమిక, ప్రాథమిక పాఠశాలల సంఖ్య అతి స్వల్పమై యుండెను. స్త్రీవిద్య అవకాశాలు మిక్కిలి తక్కువ. సాంకేతిక విద్యకు జిల్లాలలో అవకాశాలే లేకుండెను. వరంగల్ ఇంటర్మీడియేటు కాలేజి తప్ప తెలంగాణ జిల్లాలలో కళాశాలలు లేకుండెను.

హైద్రాబాదులోని కళాశాలలలో అధిక సంఖ్య విద్యార్థులు ఉర్దూ మాతృభాషగా కలిగినవారై యుండిరి. హైద్రాబాదులో నిజాం కళాశాల మిక్కిలి ప్రాచీనమైనది. అనగా అది 1887 లో స్థాపితమై, నేటికిని నడచుచున్నది. పోలీసుచర్యకు కొంతకాలము ముందువరకు యీ కళా

శాల మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధమై యుండెను. అందుచేత ఇందులో ఇంగ్లీషు మీడియంతోపాటు తెలుగుకు కొంత స్థానము ఉండెను. అయితే యీ కళాశాలలో మూడువందల మంది విద్యార్థులకన్న యెక్కువ మంది ఉండకూడదని కఠినమైన నియమము ఉండెను. ఆ మూడు వందల విద్యార్థులలో సీట్లు జాగీర్దార్లు, నవాబులు, ఉన్నత అధికారుల కుమారులకే లభించుచుండెను. వారందరు ఉర్దూ మాతృభాషగా కలిగిన వారు. ఇతరులు కొందరున్నను వారిలో అధిక సంఖ్య ఉర్దూ వైపు ఆకర్షింప బడుదురు. కొద్దిమంది మాత్రము తెలుగు రెండవ భాషగాతీసికొనెడువారు, 1917 లో అక్బర్ హైదరీగారు ఉస్మానియా విశ్వవిద్యాలయమును స్థాపించిరి. దీనికి బోధనాభాష ఉర్దూ భాష. అది రాష్ట్రములోని నూటికి పదిమంది మాట్లాడు భాష. ఆ భాష నూటికి తొంబది మంది తరగతికి చెందిన అనగా ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటక భాషలు మాతృభాషలుగా గల వారి నెత్తిమీద రుద్దబడినది. ఇంగ్లీషు భాష ఇండియాలో ప్రవేశపెట్టి మెకాలె యే ఉద్దేశాలను సాధింప నమకట్టెనో, ఆ ఉద్దేశాలనే అంతకన్న యెక్కువ తీవ్రతరముగా, అంతకన్న ప్రజల భాషలకు యెక్కువ హాని కరముగా సాధించు ఉద్దేశముతో సర్ అక్బర్ హైదరీ ఉస్మానియా విశ్వ విద్యాలయ స్థాపనము గావించి తన ఉద్దేశ సాధనలో చాలవరకు మెకాలె కన్న యెక్కువ కృతకృత్యుడయ్యెనని చెప్పవచ్చును. ఈ విధముగా పోలీసుచర్య ముగియువరకు హైద్రాబాదు విద్యా విదానములో మాతృభాష లకు ప్రాధాన్యము లేకుండెను. పోలీసుచర్య తరువాతనే హైస్కూలు తర గతుల వరకు మాతృభాషల ద్వారా, విద్యాబోధన, విశ్వవిద్యాలయ తర గతులలో ప్రాంతీయ నిర్బంధ పఠనీయములుగా చేయబడెను. ఇందుకు ఆంధ్ర సారస్వత పరిషత్తు చేసిన కృషి ప్రశంసనీయము. పోలీసుచర్యకు పూర్వము మాతృభాష ద్వారా, మెట్రిక్యులేషణ వరకు విద్యాబోధన చేయించవలెనను సూత్రమును ప్రభుత్వము ఒప్పుకొనలేదు. అట్టి పరిస్థి తులలో నారాయణగూడెములోని బాలికా పాఠశాల అట్టి ఉద్దేశముతో స్థాపిత

పైనది. ఆ పాఠశాలలో చాలకాలము పూనాలోని కర్వే విశ్వవిద్యాల యానికి అనుబంధముగా పరీక్షలు నిర్వహింపబడుచుండెను. ఈ ఉన్నత పాఠశాల సుమారు మూడు దశాబ్దాల నుండి హైదరాబాదు నగరములో ఆంధ్ర బాలికలకు చక్కని శిక్షణ యిచ్చుచు అభివృద్ధి చెంది ఈనాడొక మహాసంస్థ యైనది. ఇటీవలనే, యీ పాఠశాలకు సంబంధించిన కళా శాల రాజా బహద్దర్ వేంకట రామారెడ్డి పేరుతో స్థాపితమైనది. ఈ కళా శాలకు 1954 సంవత్సరమున ప్రధాని జవహర్లాల్ నెహ్రూ శంకుస్థాపన గావించిరి. 1955 సంవత్సరమున ఆచార్య రాధా కృష్ణులు ప్రారంభోత్సవ ముగావించిరి. నారాయణగూడెము ఆంధ్రబాలికా పాఠశాల, రాజా బహద్దర్ వేంకట రామారెడ్డి కళాశాలలకు ఆయువుపట్టు ఆంధ్ర పితామహ మాడ పాటి హనుమంతరావు పంతులుగారు. 1921 లో స్థాపితమైన యీ ఆంధ్ర బాలికా పాఠశాల అభివృద్ధికి తోడ్పడిన వారిలో కీ. శే. రాజా బహద్దర్ కొత్వాల్ వేంకట రామారెడ్డి, ప్రస్తుత రెవెన్యూ మంత్రి కొండా వేంకట రంగారెడ్డిగార్లు ముఖ్యులు. ఈ ఉభయులు హైదరాబాదు నగరములోని అనేక విద్యాసంస్థల పెంపు సొంపులకు కారణభూతులు. రెడ్డి బాలికల వసతి, రెడ్డి విద్యార్థి వసతి గృహము అను రెండు సంస్థలు హైదరాబాదులో సుమారు మూడు దశాబ్దాల నుండి పనిచేయుచున్న ఆంధ్ర సంస్థలు. పేరునకు రెడ్డి సంస్థలైనను, యీ సంస్థలు అన్ని కులాల విద్యార్థులకు అండనిచ్చినవి. హైదరాబాదు రాష్ట్రములో అన్ని రంగాలలోని ప్రముఖు లకు రెడ్డి విద్యార్థి వసతి గృహము కేంద్రమైనది. ఇటీవలనే వైశ్య, గౌడ, పద్మశాలి వసతి గృహముల నిర్మాణము జరిగి అనేక విద్యార్థులు అందులో నివసించుచున్నారు. హైదరాబాదులో ఆంధ్ర విద్యాసంస్థలు మరికొన్ని కలవు. మహరాజ్‌గంజ్‌లోని సావిత్రి కన్యాపాఠశాల, షంషేర్‌గంజ్‌లోని ప్రసన్న గజానన ఆంధ్ర బాలికా పాఠశాల. పీల్ఖానాలోని సరస్వతీ బాలికా పాఠశాల, ఆంధ్ర విద్యాభివర్ధనీ బాలుర పాఠశాల, ముఫీదుల్ అం మిడిల్ స్కూల్, మిస్ మీనింగ్ మాధ్యమిక పాఠశాలలు, బొగ్గులకుంట, ముఖ్య మైనవి. నాంపల్లిలోని ఆంధ్ర విద్యాలయము సుమారు 15 సంవత్సరాల

నుండి చక్కగా నిర్వహింపబడుచున్న ఉన్నత పాఠశాల. వరంగలులోని ఆంధ్ర విద్యాభివర్ధనీ పాఠశాల చందా కాంతయ్యగారను వైశ్య ప్రముఖునిచే స్థాపితమై, సక్రమముగా జరుగుచున్నది. జనగామలో మరొక ఆంధ్ర విద్యాలయము ఉన్నత పాఠశాలగా నిర్వహింపబడుచున్నది. బచ్చన్నపేటలోని, (జనగామ స్టేషనుకు 15 మైళ్ళు.) ఉన్నత పాఠశాల అయిదు సంవత్సరాల క్రింద ప్రారంభమై చక్కగా నిర్వహింపబడుచున్నది. ఈ విద్యాసంస్థల అభివృద్ధికి కృషిచేసిన వారిలో కీ. శే. నాగుల పల్లి కోదండరామారావుగారు, ఎం.ఎస్‌సి., ఎల్.ఎల్.బి, ముఖ్యులు. సీతారాంబాగులోని సంస్కృత కళాశాల ఆంధ్రుల సంస్థ. దీని అభివృద్ధికి కూడ శ్రీ కోదండ రామారావుగారే కారణ భూతులు. హైదరాబాదులో విద్యా వ్యాప్తికి కీర్తిశేషులు చేసిన సేవ మిక్కిలి గొప్పది. చిన్న వయస్సులో వారు మరణించిరి. వరంగలు నగరంలో రెండు సంస్కృత పాఠశాలలు నిర్వహింపబడుచున్నవి. ఖమ్మంమెట్టులో ఆంధ్ర బాలికా పాఠశాల, నల్లగొండలో ఆంధ్ర బాలికా పాఠశాల, సూర్యాపేటలో వైదికాంధ్ర బాలికా పాఠశాల, జగిత్యాలలో ఆంధ్ర బాలికా పాఠశాలలను ఉత్సాహశీలురగు ఆంధ్రులు నడుపుచున్నారు. ఈ విధముగా హైదరాబాదు రాష్ట్రములో ఆంధ్రసంస్థలు అభివృద్ధి చెందుచున్నవి. అయితే మహారాష్ట్రులతో పోల్చినప్పుడు ఆంధ్రులు సంస్థల నిర్వహణ విషయములలో వెనుకబడి యున్నారని ఒప్పుకొనక తప్పదు. మహారాష్ట్ర ప్రాంతమున ప్రైవేటుగా నిర్వహింపబడుచున్న కళాశాలలు పాఠశాలలు తెలంగాణముకన్న యెక్కువగా నున్నవి. ఆంధ్ర రాష్ట్రమున గుంటూరు కృష్ణా జిల్లాలలో ప్రైవేటు ఉన్నత పాఠశాలలు అత్యధిక సంఖ్యలో నున్నవి. వాని ముందు తెలంగాణమున ప్రైవేటు విద్యాసంస్థల సంఖ్య స్వల్పమే.

పోలీసుచర్యకు పూర్వము హైద్రాబాద్ జిల్లాలలో, ముఖ్యముగా తెలంగాణ జిల్లాలలో ప్రభుత్వ పాఠశాలల సంఖ్య కూడ తక్కువ. జిల్లా కేంద్రాలలో మాత్రమే ఉన్నత పాఠశాలలు ఉండెను. పోలీసుచర్య తర్వ

వాత పరిస్థితులు మారినవి. ప్రభుత్వ పాఠశాలల సంఖ్య ప్రతి సంవత్సరము పెరుగుచున్నది. వృత్తివిద్యాబోధన సౌకర్యాలు కూడ తెలంగాణములో తక్కువే. తెలంగాణ జిల్లాలలో వరంగల్ నందు ఒకే ఒక కళాశాల కలదు. అది నిరుటి వరకు ఇంటర్మీడియేటు కళాశాలయే. ఈ సంవత్సరము డిగ్రీ కళాశాలగా మార్చబడినది. ఈ సంవత్సరము వరంగల్లులో ఒక Polytechnic Institute తెరువబడుచున్నది. కడమ జిల్లాలలో సాంకేతిక వృత్తివిద్యా సౌకర్యాలు అతి స్వల్పము.

హైదరాబాద్ రాష్ట్రములో తండాన కథలు, యక్షగానాలు ఇటీవల వరకు వ్యాప్తిలో నుండెను. ఇప్పుడవి సరియైన ఆదరణలేక అంతరించిపోవుచున్నవి. తోలుబొమ్మలాట, భాగవతాలు, కూడ ఇరువది సంవత్సరాల క్రింద వరకు పల్లెలలో విశేషవ్యాప్తిలో నుండెను. ఇప్పుడు వాని సంఖ్య కూడ తక్కువై, వెదికిననే కానవచ్చుట జరుగుచున్నది. హైదరాబాదు రాష్ట్రములో కాలక్షేపాలు హరికథలు యీ శతాబ్దారంభమున గడచిన శతాబ్దాంతమందు మిక్కిలి ప్రచారములో నుండెను. ఆదిభట్ల నారాయణరావు గారు, బాలాజిదాసు గారు యీ ప్రాంతాలకు వచ్చి హరికథలు చెప్పిరి. ఇక్కడ కూడ ఆ కాలమున హరికథలు చెప్పువారు చాలమంది ఉండువారు. వరంగలులోని చందాల కేశవదాసు అనువారు యీ హరికథలు చెప్పుటలో ప్రఖ్యాతులు. వరంగల్ ప్రక్కనేయున్న మడికొండ అను గ్రామములోని ఐక్కయ్య శాస్త్రులు అనువారు ఆ కాలమున కాలక్షేపాలు చెప్పుటలో ప్రసిద్ధి. ఇంకనుజిల్లాలలో యీ విధముగా హరికథలు చెప్పువారు, కాలక్షేపాలు చేయువారు, వారిలో శ్రీవైష్ణవులు యెక్కువ సమృద్ధిగా నుండిరి. దేవాలయాలలో ఉత్సవాలు జరిగినప్పుడు యీ హరికథలు కాలక్షేపాల కార్యక్రమము విధిగా జరుగుచుండెను. గడచిన నూటాయేబది సంవత్సరాలలో జనులలో మన సంస్కృతిని రక్షించిన గౌరవము దేవాలయాలకు, హరికథలకు, కాలక్షేపాలకు, తోలుబొమ్మలాటలకు, భాగవతాలకు, తందనాన కథలకు చెందుచున్నది. సాంస్కృ

తిక పునరుజ్జీవనమునకు వీని దోహదము మిక్కిలి గొప్పది. తెలంగాణములో మైలవరము సురభి కంపెనీ నాటకాభిరుచిని కలుగజేసినది. తెలంగాణములోని ముఖ్యకేంద్రాలన్నిటిలోను యీకంపెనీలు తమ ప్రదర్శనాలు ఇచ్చినవి. ఇవిగాక ఆంధ్రదేశము నుండి ఇతర నాటక సమాజాలు కూడ యీ శతాబ్దారంభమున గడచిన ఇరువదియేండ్ల క్రిందవరకు పల్లెపల్లెలో తిరిగి నాటకాలు వేసినవి. తాటి నూకుల పాకలలో కూడ యీ నాటక ప్రదర్శనాలు జరిగినవి. ఈ నాటక ప్రదర్శనాలు జనులను అబాలగోపాలమును ఆకర్షించి సాహిత్యాభిరుచిని ఆంధ్ర సంస్కృతిపై అభిమానము కలుగజేసినవి. లక్ష్మణరావు గారి విజ్ఞాన చంద్రికా మండలి తరువాత ఆంధ్రరాష్ట్రానికి-తెలంగాణాకు మధ్య మంచి బలమైన వంతెన కట్టిన గౌరవము యీ నాటక సమాజాలకు యీయవలసి యున్నది. ఈ పరిస్థితులలో స్థానికముగా కూడ కొన్ని నాటక సమాజాలు, నటకులు బయలుదేరి, నాటక కళాప్రచారానికి తోడ్పడిరి. ఆదిపూడి సోమనాథరావు గారు, మైలవరము నరసింహశాస్త్రి యీ శతాబ్దిలో సికింద్రాబాదు నగరమున ఒక నాట్యమండలిని స్థాపించి నాటకాలు వేయించినారు. సికింద్రాబాదులోని జగదీశ నాట్యమండలి ఇక్కడి నాటక సమాజాలలో ఎన్నదగినది. ఈ నాట్యమండలిలో ముఖ్య పాత్రధారులు బుచ్చయ్యగారు. ఈ మండలివారు బెజవాడ, గుంటూరు, సింగరేణి, సికింద్రాబాదు మొదలైన పట్టణాలలో నాటకాల ఆడి మెప్పులు పొందిరి. తరువాత యువకులు అనేకులు నాటక కళామండలులను నెలకొల్పి కృషిచేసిరి. ఇట్టి మండలులలో పేర్కొనదగినవి హైద్రాబాదులోని ఆంధ్ర నాటక కళాపరిషత్తు. ఆదర్శ నాటక కళాపరిషత్తు, సన్మిత్ర నాటక కళాసమితి, విజయకళా సమితి, ఇండియన్ నేషనల్ థియేటర్, కాకతీయ కళాసమితి వరంగల్, మొదలైనవి ముఖ్యమైనవి. సినిమాలు వచ్చిన తరువాత నాటకాలపై మోజు తగ్గినది. సినిమాలు జిల్లాలకు వ్యాపించినవి. నాటక సమాజాలు చాలా అంతరించినవి. హైద్రాబాదు-

సికింద్రాబాద్ నగరాలలో ఉత్సాహవంతులు, యువకులు కొన్ని నాటక సమాజాల ద్వారా అప్పుడప్పుడు ప్రదర్శనాలు గావించుచున్నారు.

చిత్రకళను గూర్చి నాలుగు మాటలు. కుతుబ్షాహీల కాలములో ఇక్కడి చిత్రకళ మీద కొంత మొగలాయి మరియు ఎక్కువగా పరిషియన్ చిత్రకళా ప్రభావము బాగుగా పడినది. స్థానిక చిత్రకళ పైన మొగలాయి మరియు పరిషియన్ చిత్రకళా ప్రభావ ఫలితముగా ఇక్కడ అసఫ్జాహీల పరిపాలనలో దక్కన్ చిత్రకళ అనునది అవతరించెను. నిజాం అలీఖాన్ దర్బారులోని ఆస్థాన చిత్రకారుడు వెంకటాచలం అను నతడు యీ దక్కన్ చిత్రకళా సాంప్రదాయ స్థాపకుడు. ఇందులో ప్రవీణుడు. నిజాం అలీఖాన్ వెంకటాచలమునకు ప్రతి సంవత్సరము పన్నెండు వేల ఆదాయము గల జాగీరు నిచ్చెను. వెంకటాచలము శిష్యులందరు దక్కన్ చిత్రకళా సాంప్రదాయమునే పాటించిరి.

నిర్మలలో రంగులు వేయుట చిత్రాలు వేయుట ఒక పరిశ్రమగా అభివృద్ధి పొందినది. ఇది దక్కన్ చిత్రకళా సాంప్రదాయమే. నిర్మల చిత్రకారులు వేములవాడకు వెళ్ళి అక్కడ కూడ యీసాంప్రదాయమును నెలకొల్పిరి. గద్వాల, వనపర్తి సంస్థానాలలో యీ రంగులు వేయుట చిత్రాలు వేయుట ఒక పరిశ్రమగా వ్యాప్తి జెందినది. భారత రామాయణ వ్రాత ప్రతులలో చిత్రాలు వేయువారు కూడ కొందరు బయలు దేరిరి. ఇట్టి చిత్రాలతో కూడిన వ్రాత పుస్తకాలు రెడ్డి విద్యార్థి వసతి గృహమున, ఉస్మానియా విశ్వవిద్యాలయము నందు, సాలార్జంగ్ మ్యూజియంలో నున్నవి. బట్టల మీద అద్దకపు పనికూడ యీ దక్కన్ చిత్రకళా సాంప్రదాయము తెలంగాణాలో వ్యాపింప జేసినవి. ఇది మూడు విధాలుగా వ్యాపించినది. 1. బట్టల మీద చిత్రాలు వేసి అద్దకము చేయువారు కుట్టువారు కొందరు. 2. భారత రామాయణ కథలను తెరల మీద చిత్రించువారు. ఈ తెరలు వీధులలో కథల చెప్పు వారికి ఉపయోగ

పడుచుండెను. కాటమరాజు కథ చెప్పువారు యీ తెరలను ఉపయోగించువారు. ఇప్పుడు జనగామ తాలూకాలోని చేర్యాల గ్రామములో నున్నారు. వీరిని కాకిపడగల వారనెదరు. ఇంకను యితర జిల్లాలలో కూడ వీరు కలరు. జంతువుల వేషాలు వేయువారికి ముసుగులు అట్టకము చేసి యిచ్చువారు కొందరు. భువనేశ్వరము నెత్తిమీద పెట్టుకొని అందులో నుండి వివిధ చిత్రాలు తీసి, ఊరూరు తిరిగి ప్రదర్శించువారు కొందరు. 3. వ్రాత ప్రతులను చిత్ర పటములతో అలంకరించువారు మరి కొందరు. ముఖ్యముగా రామాయణ భారతాది కథలు యిట్టి చిత్రాలు వేయబడుచుండెను. ఇట్టి వారిలో గణుతి కెక్కినవారు బాలయ్య, వేంకట రామయ్య అనువారు. వీరు యిప్పుడు హైద్రాబాదులో నున్నారు. దక్కన్ చిత్రకళలో ప్రవీణులు వెంకట రామయ్య, బాలయ్యకు పినతండ్రి. వీరి చిత్రాలు ఢిల్లీ మొదలైన చోటులలో ప్రదర్శనాల యందు ప్రశస్తి గాంచినవి.

తరువాత పాశ్చాత్య చిత్రకళా ప్రభావము కనడుచున్నది. ఇక్కడి నవాబులు, జాగీర్దారులు పాశ్చాత్య చిత్రాలను కొనితెచ్చి తమ భవనాలకు అలంకరించుకొనుటలో యీ చిత్రకళా సాంప్రదాయముమీద ఆదరము పొందినది. ఇంగ్లీషు ఉన్నతాధికారుల ద్వారా విదేశ చిత్రకారులు ఇక్కడికి వచ్చి పోషణ పొందిరి. ఇందువలన స్థానిక చిత్రకారులపైన పాశ్చాత్య చిత్రకళా ప్రభావము పడినది. తత్ఫలితముగా దక్కన్ చిత్రకళలో పాశ్చాత్య చిత్రకళ సమ్మిశ్రితమై మరొక క్రొత్త కళాసాంప్రదాయము ఉద్భవించినది. నగ్న చిత్రాలు మొదలైనవి చెత్త రకపు చిత్రకళ కొంత ప్రచారములోనికి వచ్చినది. ఇందులో ప్రతిభ చాల తక్కువ.

ఆ రోజులలో ఇక్కడి చిత్రకారులు విదేశాలకు వెళ్ళి శిక్షణ పొందుట నాగరికతగా బావించెడివారు. వీరు యిరోపా కళాసాంప్రదాయమును నేర్చుకొని వచ్చిరి. కొందరు బొంబాయి School of art కు

శిక్షణకై వెళ్ళిరి. ఇది కూడ పాశ్చాత్య సాంప్రదాయమే. ఖయ్యాం అను చిత్రకారుడు పాశ్చాత్య చిత్రకళా సాంప్రదాయములో ప్రవీణుడు. తెరలపై చిత్రాలు వేయుటలో ఇతడు భారతదేశమున అద్వితీయుడని చెప్పెదరు. దీన్‌దయాళ్ అను మరొకరు కూడ ఇట్టి చిత్రకారులే. ఈయనకు అసఫ్‌జాహి పరిపాలకుల పోషణ లభించినది.

పత్రికలు, కళాప్రదర్శనాల ద్వారా బెంగాల్ చిత్రకళా సాంప్రదాయము హైద్రాబాదులో పెట్టినది. జాతీయ భావాలు యీ చిత్రకళను ప్రోత్సహించినవి. కొంతమంది ఇటువైపు ఆకర్షితులైరి. హైద్రాబాద్‌లో School of Art సుమారు 15, సంవత్సరాల క్రింద స్థాపితమై నేడు College of Art గా మారినది. ఈ సంస్థలో వంగ సాంప్రదాయము-బొంబాయి సాంప్రదాయము మిళితమై, ఇప్పుడు వంగ సాంప్రదాయము ప్రాధాన్యము వహించుచున్నది. హైద్రాబాద్‌లోని ఆధునిక చిత్రకారులలో చాలమందిమీద ఫ్రెంచి సాంప్రదాయప్రభావం కనపడుచున్నది. వీరిలో పి. తిరుపతిరెడ్డి, సయ్యద్ బిన్ మహమ్మద్. సాదతలీఖాన్ ముఖ్యులు. బొంబాయి చిత్రకళాప్రభావము మధుసూదనరావుమీద కనపడుచున్నది. మల్లారెడ్డి అను చిత్రకారునిమీద బొంబాయి కళాప్రభావము, ఊర్మిళా షా, వరంగల్ మీద బొంబాయి బెంగాల్ చిత్రకళా ప్రభావము, రాజయ్య. సిద్దిపేట గారిమీద వంగ చిత్రకళా ప్రభావము గోచరించుచున్నది. వీరు యువ చిత్రకారులు. ఈ చిత్రకారులలో కొండపల్లి శేషగిరిరావు గారిని ప్రత్యేకముగా పేర్కొనవలసి యున్నది. ఈయనలో గొప్ప ప్రతిభ కనపడుచున్నది. ఈయన చిత్రాలు అఖిలభారత ప్రదర్శనాలలో మెప్పుపొంది యున్నవి. ఈయన శాంతినికేతనమునందు కొన్నాళ్ళు నివసించెను. ఈయనమీద వంగ చిత్రకళా ప్రభావము, కొంత చైనా చిత్రకళా ప్రభావము గోచరించుచున్నది. మార్చాల రామాచార్యులు అను చిత్రకారుడు బందరులో ప్రమోదకుమార ఛటర్జీవద్ద శిక్షణ వడసెను. గిడుతూరి సూర్యం అడవి బాపిరాజుగారి శిష్యుడు. ప్రస్తుత

విద్యాశాఖ ఉపమంత్రిణి సంగెం లక్ష్మీబాయమ్మ మీద వేపీప్రసాద్‌రావ్ చౌదరి ప్రభావము కనపడుచున్నది. కుమారిలస్వామి అను ఆంధ్ర యువకుడు ప్రస్తుతము ఢిల్లీలో నున్నాడు. ఆయనమీద శాంతినికేతన ప్రభావము కలదు.

తెలంగాణములో సంస్థానాలు సంగీతమును, నృత్యమును పోషించినవి. భాష మీద వలెనే సంగీత నృత్యాల మీద హిందూస్తానీ సాంప్రదాయ ప్రభావము పడినది. కర్ణాటక సంగీతమును, భరత నాట్యమును ప్రభుత్వము ఆదరించ లేదు. అందుచే యీ రెండు కూడ కొంత సన్నగిల్లినవి. సంగీతము, హరికథలు చెప్పు వారిని ఆశ్రయించెను. వారైనను పల్లెపట్టులలో నివసించి గానవోసోద్దైన్యమున నుండిరి. సంస్థానాల తరువాత ఆలిండియా రేడియో హైదాబాదు వారు యీ కర్ణాటక సంగీతమును కొంత ఆదరించిరి. మన సంగీతమును విధ్వంసము గావించిన హార్మోనియం తెలంగాణా సంగీత రంగముపై దాడి చేసినది. హార్మోనియం వాయించుటలో కొందరు ప్రత్యేక కీర్తి గడించిరి. అంబా ప్రసాద్‌గారు ఇందులో ముఖ్యులు. ఫిడేలు వాయించుటలోను గాత్ర సంగీతమందును హుజూరునగరం బూరుగుగడ్డ సీతారామానుజాచార్యులవారు ప్రతిభావంతులుగా ప్రసిద్ధి పొందినారు. హుజూరునగరం వేంకటరాజుగారు కూడ గాత్ర సంగీతమందు ప్రసిద్ధులు. వరంగలు వాస్తవ్యుడు తంబళ్ళ పులయ్య తబలా వాయించుటలో యావదాంధ్ర ప్రఖ్యాతి గడించెను. వీణలో ములుగు శివానందశాస్త్రిగారు కీర్తి గాంచిరి. తబలా వాద్యమునందు కీర్తిగాంచిన వారిలో హైదాబాదులోని షాలిబండ వాస్తవ్యులైన కీ.శే. మార్తాండరావుగారు పేర్కొనదగినవారు. ఆదిలాబాదు జిల్లాలోని రాజూరా వాస్తవ్యులైన బాబూరావుగారు, వీణ నజీరులు, తబలా వాయిద్యము నందు యావద్భారత ప్రఖ్యాతిని గాంచిరి. నమ్మోట అంబా ప్రసాద్‌గారు హార్మోనియం వాయిద్యములో అత్యంత కుశలుడు. బొంబాయి మొదలైన ప్రాంతాలలో ఈయన తన విద్యను ప్రదర్శించి గౌరవము పొంది

నాడు. ఈయన హైదరాబాదు ప్రభుత్వ సమాచార శాఖలో పని జేసి ఇటీవలనే ఉపకార వేతనము పొందినాడు. పోలీసుచర్య తరువాత నుంచి హైదరాబాదు ప్రభుత్వము పుచ్చా సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి నెలకు రెండు వందల యేబది రూపాయల వేతనము నిచ్చి సంగీతములో పరిశోధన చేయుటకై ప్రోత్సహించుచున్నది. వారు తమ పరిశోధనలు ఒక పుస్తకముగా వ్రాయుచున్నారు. హైదరాబాదులో ఇటీవల సంగీత నృత్య పాఠశాల యొకటి నెలకొల్పబడినది. ఇందు కర్ణాటక సంగీతము మరియు భరత నాట్యము నందు శిక్షణ యీయబడుచున్నది. ఇటీవల విద్యావంతులైన వారు తమ పిల్లలకు కర్ణాటక సంగీతము, భరత నాట్యములో శిక్షణ నిప్పించుచున్నారు. ఇది శుభ సూచకము. పునరుజ్జీవనము తెలుపుచున్నది. కొందరు భరత నాట్యమును ఉపాసించు చున్నారు. గోపాల్‌రాజు భట్టు యీ యువకులలో నొకరు. పూర్వకాలమున హైద్రాబాదు నగరమునందు తెలుగు పుస్తకాలు విక్రయించు దుకాణము లేకుండెను. తెలుగు పుస్తకాలు ఆంధ్ర ప్రాంతము నుండి తెప్పించుకొనెడివారు. సుల్తాన్‌బజార్, నాంపల్లి గౌరీ శంకరవర్మగారి పుస్తక విక్రయశాల ఒకటి మాత్రమే యుండెను. గౌరీ శంకరవర్మగారు ఆనాటి ఆంధ్రోద్యమ ముఖ్య కార్యకర్తలలో నొకరై ఆంధ్ర వాఙ్మయ ప్రచారానికి తోడ్పడిరి. ఇప్పుడు ఆంధ్ర పుస్తక విక్రేతలు, ప్రచురణ కర్తలు, ముద్రణాలయాధికారులు పెక్కు మంది బయలు వేరినారు.

అన్యభాషలలో ప్రవీణులైన వారిని గూర్చి రెండు మాటలు. ఉర్దూ, ఫార్సీ భాషల యందు ప్రవీణులై ఉర్దూలో మంచి రచయితలుగా పేరు పొందిన ఆంధ్రులలో మాడపాటి హనుమంతరావు గారిని, మందుముల నరసింగరావు గారిని, బూర్గుల రామకృష్ణారావు గారిని పేర్కొనవలసియున్నది. ఉర్దూలో రయ్యత్ అను పత్రికను పోలీసు చర్యకు పూర్వము చాల సంవత్సరాలు మందుముల నరసింగరావుగారు నడిపి యుండిరి. ఉర్దూలో కవిత్వము చెప్పినవారు, చెప్పగలవారు హైదరాబాదు ఆంధ్రు

లలో కలదు. హైద్రాబాదులో ఉర్దూ భాషాభివృద్ధికి ఆంధ్రులు కూడ భాగస్వాములైనారు. ఉర్దూ భాషా పాండిత్యము నందు ఆంధ్ర మహా రాష్ట్ర కర్ణాటకులలో ఆంధ్రులదే పై చేయిగా నున్నది.

హైద్రాబాదు నుండి వెలువడిన వెలువడుచున్న ఇంగ్లీషు పత్రిక లగు హైద్రాబాదు బులెటిన్, దక్కన్ క్రానికల్, డెయిలీ న్యూస్, న్యూయీరా, సెంటినల్, స్ట్రగుల్ పత్రికల నిర్వహణలో సంపాదకత్వములో ఆంధ్రులకు ప్రముఖ స్థానము కలదు. దక్కన్ క్రానికల్‌కు చాల కాలము సంపాదకులుగా నుండి, డెయిలీ న్యూస్ పత్రికను స్థాపించి తన మరణము వరకు దానికి సంపాదకులుగా నుండిన బుక్క పట్టణము రామానుజాచార్యులవారు ఆంగ్లభాషలో ప్రత్యేకమగు శైలి కలిగిన మంచి రచయితలు.

ఈ విధముగా తెలంగాణమున అర్ధశతాబ్దము నుండి ప్రాచీన నవీన కావ్య పద్ధతులలో రచనలు సాగినవి. చిన్న కథలు, నాటకములు, వ్యాసములు, విమర్శలు, పరిశోధనలు వృద్ధి నొందినవి. పత్రికలు, గ్రంథమాలలు, సారస్వత సంస్థలు ప్రారంభింపబడి మహోజ్వలముగా సారస్వతోద్యమము నిర్వహింపబడుచున్నది. ఈ వ్యాసము యొక్క అరంభమున 1920 ప్రాంతమున తెలంగాణ పరిస్థితిని గూర్చి మాడపాటి హనుమంతరావుగారు వ్రాసిన వ్యాసముల నుదహరించి యున్నాను. నాటికి నేటికిని పరిస్థితులు మారినవి. ఎన్నడును అనుకొనని రీతిగా, అనుకొననంత వేగముగా అర్థిక సామాజిక పరిస్థితులు మారినవి. భారత స్వాతంత్ర్యము, హైద్రాబాదుపై పోలీసుచర్య, బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన అను చరిత్రాత్మకములగు సంఘటనలు జరిగినవి. రాజ కీయముగా ప్రాథమిక స్వత్వములు పూర్తిగా సిద్ధించినవి. అర్థికముగా జాగీర్దారులు, సంస్థానాధీశ్వరులు అంతరించి, పెద్ద అదాయాలపై పన్నులు పెరిగి, దున్నుకొను రైతులకు భూములపై హక్కు కలిగి, అర్థిక అస మానత్వము తొలగించ ప్రయత్నాలు జరుగుచున్నవి. సామాజికముగా

తెలుగు స్త్రీలకు పరదా విముక్తి కలిగినది. బాల్యవివాహాలు అంతరించి నవి. వితంతు వివాహాలు సాధారణమైనవి. స్త్రీ విద్య అభివృద్ధి చెందు చున్నది. స్త్రీలకు పురుషులతో సమాన అవకాశాలు లభించుచున్నవి. వైజ్ఞానికంగా తౌరక్యాంధ్రము తొలగి పోవుచున్నది. పల్లెపల్లెలో పాఠశాలలు నెలకొల్పబడి, విద్యావ్యాప్తి జరుగుచున్నది. విశాలాంధ్రోద్యమాలు వచ్చినవి. హైదరాబాదు ఆంధ్రనగరమని మహారాష్ట్ర-కర్ణాటకులు నిస్సందేహముగా అంగీకరించినారు. ఆంధ్రులకు వివిధ రంగాలలో అర్హమైన అవకాశాలు లభించుచున్నవి. ఆంధ్ర సంస్కృతి దీపము ప్రకాశవంతముగా వెలుగుచున్నది. ఆంధ్ర సంస్థల సంఖ్య అతిశయించు చున్నది. స్త్రీ పురుష కట్టుబొట్టు తీరులలో, ఆచార వ్యవహారాలలో, వేష భాషలలో కాలానుగుణమైన మార్పు వచ్చినది. ఇది యంతయు భవిష్యదభ్యుదయమునకు నిదర్శనము. ఈ పునరుజ్జీవనము సంగీతము, చిత్రకళ నృత్యము, నాటకము మొదలైన వివిధ కళా రంగాలలో కూడ కనపడు చున్నది. ఆంధ్రోద్యమము యీ పునరుజ్జీవనానికి పునాది వంటిది. ఆంధ్రోద్యమమే తెలంగాణమునకు సర్వరంగములందు జాగృతి కలిగించి నది. అలస్యముగ ప్రబుద్ధమైనను తెలంగాణము చక్కని చిక్కని నడకతో, నిర్మాణాత్మక దృష్టితో ముందుకు సాగుచున్నది. కాని ఆంధ్రులలో బహు నాయకత్వము, అనేకత్వము, సంఘీభావన్యూనత జరిగిన అభివృద్ధితోపాటు అడుగడుగున ప్రత్యక్షమగుచున్నది. కులతత్త్వాలు వృద్ధి పొందుచున్నవి. ఉర్దూకు బదులుగా హిందీ సామ్రాజ్యతత్త్వము సాంస్కృతిక రంగాలలో ప్రత్యక్షమగుచున్నది. ఈ హిందీ ప్రాబల్యము వ్యామోహము, ఆంధ్ర సారస్వత సంస్కృతుల అభివృద్ధికి వ్యాప్తికి, వికాసమునకు ప్రతిబంధకము కానట్లుగా జాగరూకత వహించ వలసి యున్నది. నేడు హిందీ ప్రచార సంఘములు, హిందీ ప్రేమీ మండలులు పల్లెపల్లెకు ప్రాకుచున్నవి. రేడియో హిందీ ప్రచారపు ఒత్తిడి మితిమీరి పోవుచున్నది. హిందీ పరీక్షలు, హిందీ సంస్థలు హిందీ పండితుల కల్లో

లములు జనులను ఉక్కిరి బిక్కిరి జేయుచున్నవి. చివరకు ఉస్మానియా విశ్వవిద్యాలయమును దక్షిణ దేశమునకు హిందీ కేంద్రముగా హిందీ విశ్వవిద్యాలయముగా మార్చవలయునను ఉద్దేశము రాష్ట్ర ప్రజలలో తీవ్ర అసంతృప్తికి కారణభూతమై గొప్ప అలజడి చెలరేగి, ప్రబల ప్రతిఘటన జరిగినది. కావున హిందీ భాషా ప్రచారము సామ్రాజ్య తత్వము క్రిందికి దిగకుండునట్లుగా చూడవలసియున్నది.

ఈస్టిండియా కంపెనీ వారు వ్యాపారముకొరకు మనదేశమునకు వచ్చి క్రమక్రమముగా రాజకీయ అధికారము సంపాదించుకొని విస్తరించి, అప్పుడు ఆంధ్రదేశానికి పరిపాలకుడుగా నున్న హైద్రాబాదు నిజామును తమ సామంతునిగా చేసుకొనిరి. తరువాత కొంత కాలానికి ఆంధ్ర దేశములోని సర్కారు జిల్లాలలో రాయలసీమ కంపెనీ పరిపాలన క్రిందికి పోవుట జరిగినది. అనగా 1766 సంవత్సరము తరువాత నుండి తెలంగాణము ఆంధ్రదేశమునుండి విడిపోయినది. 1766 లో ఉత్తర సర్కారులు, 1800 లో దత్తమండలములను నిజాము ఇంగ్లీషు వారికి ఇచ్చినాడు. ఇది జరిగి ఇప్పటికి సుమారు రెండువందల సంవత్సరాలు కావచ్చుచున్నది. ఈ రెండు వందల సంవత్సరాలలో తెలుగు దేశ సమైక్యతకు భంగము కలిగి భిన్నపరిపాలన ఫలితముగా ఏర్పడిన పొలిమేరలు ఉభయ ప్రాంతములవారు ఒకరి నొకరు అర్థము చేసుకొనుటకు ప్రతిబంధకములైనవి. ఈ ఎడబాటు ఒకరు మరొకరి ఉనికిని గమనించ లేని పరిస్థితిని కూడ కలుగ జేసినది. హైద్రాబాదులో ఆంధ్రులు కలరాయని ఆంధ్ర సోదరులు ఆశ్చర్యపడిన నిదర్శనాలు కలవు. మీరు హైద్రాబాదు వాసులైనప్పటికిని తెలుగు మాట్లాడ గలుగు చున్నారేయని కొందరాంధ్రులు తెలంగాణ వాసులను గూర్చి అబ్బురపడిన దృష్టాంతములు కలవు. ఆధునికాంధ్ర వాఙ్మయమున ప్రసిద్ధులైన ఒక రచయిత తెలంగాణమున తెలుగు రచయితలు కలరా! యని ఒక సందర్భమున

నన్ను ప్రశ్నించి యుండిరి. మొత్తము రాజకీయ విభజన సాంస్కృతికముగా తెలుగుదేశమునకు మిక్కిలి హాని కలిగించినది.

ఈ కాలమున, నూటయేబది సంవత్సరాల క్రింద విడిపోయిన యీ ఉభయ ప్రాంతాలను దగ్గరకు తీసికొని వచ్చిన వారిలో స్వర్గీయ వేంకట లక్ష్మణరావుగారు ముఖ్యులు. వారు ఉభయ ప్రాంతాలతో సంబంధాల కలిగి యుండి యీ రెండు ప్రాంతాలను వైజ్ఞానిక బంధముతో బంధించిరి. తరువాత నాటక సమాజాలు, అవధానాలు, గ్రంథాలయోద్యమము, గ్రంథాలయ సంఘ సభలు, సాహితీ సంస్థలు, పత్రికలు, పుస్తకాలు క్రమక్రమముగా యీ రెండు ప్రాంతాల ప్రజలను సన్నిహితులను గావించినవి.

ఇటీవల హైద్రాబాదు నగరమున జరిగిన తెలుగు భాషా సమితి శాఖ ప్రారంభోత్సవ సందర్భమున, 26-6-55 ఆ సమావేశమున కధ్యక్షత వహించిన ఆంధ్ర ముఖ్యులు కొండా వేంకట రంగారెడ్డిగారు సాంస్కృతికముగా విశాలాంధ్ర యేర్పడినదని ఉద్ఘాటించిరి. సాంస్కృతికముగా యేర్పడిన విశాలాంధ్ర. రాజకీయ విశాలాంధ్ర సాధనకు కారణభూతము కాగలదని నిస్సంశయముగా చెప్పవచ్చును.

ఈ రెండు ప్రాంతాలు రాజకీయముగా ఒక్కటి కావలెనను నినాదమును లేవదీసిన వారిలో అయ్యదేవర కాళేశ్వరరావుగారిని ఆంధ్ర కమ్యూనిస్టు నాయకులను గూడ పేర్కొనవలసి యున్నది. కమ్యూనిస్టు నాయకులు తాము విజయవాడ నుండి ప్రకటించుచున్న పత్రికకు విశాలాంధ్ర యను నామకరణము గావించి, యీ రెండు ప్రాంతాల సమైక్యత తమ ఆదర్శమని ఉద్ఘాటించినారు.

పోలీసుచర్యతరువాత హైద్రాబాదు విభజన జరిగి, ఇందులోని ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటక ప్రాంతాలు పరిసర భాషా ప్రాంతాలతో కలిపి వేయుట జరుగవలసి యుండెను. కాని ఎందువలననో అట్లు జరుగలేదు. పోలీసు

చర్య తరువాత విశాలాంధ్ర మహాసభ మొదటి సమావేశము వరంగలులో జరిగి తెలంగాణా ఆంధ్ర రాష్ట్రాల రాజకీయ సమైక్యత జరుగుట అవసర మని తీర్మానించినది. అప్పటి హైదరాబాదు స్టేటు కాంగ్రెస్, నిజామా బాదు సమావేశములో, మరియు ఆంధ్ర ప్రాంత కాంగ్రెస్ ఘనపురములో విశాలాంధ్ర ఆశయమును బలపరచు తీర్మానాలు గావించినవి. క్రమ క్రమముగా యీ రెండు ప్రాంతాలు ఏకము కావలెనను ఉద్యమము బల పడుట ప్రారంభించినది. ఆంధ్రరాష్ట్రము యేర్పడుటతో యీ ఉద్యమ మునకు అధిక ప్రాధాన్యము వచ్చినది. ఈ సందర్భమున విశాలాంధ్ర స్థాపన అను ఆదర్శముతో నిర్వహింపబడుచున్న ఉద్యమము సాంస్కృతి కోద్యమమని మనము గమనించుట అవసరము. ఈ సత్య మును విశాలాంధ్రమహాసభ ...... ఆనాడుస్వర్గీయకొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారు హైదరాబాదు నగరమున విజ్ఞాన చంద్రికా మండలి, కృష్ణదేవరాయల గ్రంథాలయాల స్థాపనతో ప్రారంభము గావించిన ఆంధ్రుల సాంస్కృతిక సమైక్యతా ఉద్యమము యీ నాడు ఫలించి రాజకీయ సమైక్యత ఉద్యమానికి బలమైన ఊతనిచ్చి, సత్వర విశా లాంధ్ర స్థాపనకు నాందీ ప్రస్తావనలు గావించినది.

( స మా ప్తి )

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 10 | 4 | నమర్దిత | నమర్థిత |
| 11 | 6 | అశుతోమ | అశుతోషు |
| 13 | 9 | పునరుద్ద | పునరుద్ధ |
| 19 | 3 | కాడ్వెలు | కాల్డ్వెలు |
| 19 | 24 | యీా | ఈ |
| 20 | 2 | అంధ్ర | ఆంధ్ర |
| 20 | 8 | ఆంథ్ర | ఆంధ్ర |
| 24 | 14 | వనప్రాకం | పనప్రాకం |
| 31 | 13 | శతచ్ఛంద్ర | శరచ్ఛంద్ర |
| 31 | 15 | తమేశ | రమేశ |
| 32 | 11 | తచనల | రచనల |
| 32 | 12 | తెగులు | తెలుగు |
| 32 | 15 | కలవారై | కలవారే |
| 37 | 23 | యెక్కువగా | ఎక్కువగా |
| 45 | 20 | తీక్షితార్ | దీక్షితార్ |
| 45 | 26 | వతలీలా | పరలీలా |
| 46 | 26 | గౌతవ | గౌరవ |
| 47 | 27 | నివసించి | నివసించిన |
| 48 | 15 | చెంగల్వాయ | చెంగల్వరాయ |
| 48 | 19 | రచించెను | రచించిరి |
| 55 | 1 | మల్లయు | మల్లయుద్ధ |
| 56 | 20 | వివిథ | వివిధ |

| | | | |
|---|---|---|---|
| 64 | 14 | స్వాతంత్ర | స్వాతంత్ర్య |
| 67 | 5 | విజ్ఞానం | విజ్ఞానము |
| 67 | 17 | భాషానిలయం | భాషానిలయము |
| 71 | 6 | సేకరించుట | సేకరించుటకై |
| 72 | 14 | 1907 | 1900 |
| 73 | 9 | రావుగారి | రావుగారు |
| 81 | 11 | కాశీలోన | కాశీలోని |
| 81 | 18 | అక్కడినుంచి | అక్కడినుండి |
| 82 | 1 | రాజుగారు | రాజుగారి |
| 83 | 12 | ప్రాకారము | ప్రాసాదము |
| 84 | 17 | వేపర్ల | యాపర్ల |
| 86 | 5 | రసప్రకీర్ణము | రసప్రకరణము |
| 86 | 8 | ధైన్యము | దైన్యము |
| 87 | 13 | శాస్త్రాభ్యాసం | శాస్త్రాభ్యాసము |
| 88 | 4 | మల్లిఖార్జున | మల్లికార్జున |
| 89 | 23 | తూమునూరు | మామునూరు |
| 95 | 15 | యణరావు | యణదాసు |
| 96 | 2 | కంపెనీ | కంపెనీలు |
| 96 | 2 | జేసినది | జేసినవి. |

కామాలు, చుక్కలు, అస్థానపతితములైనవి. వానిని సవరించుకొని చదువు కొనవలెను.

గోలకొండ ముద్రాక్షరశాల బషీర్‌బాగ్ హైద్రాబాద్ (ద.)